శ్రీరస్తు

# దేశింగురాజుకథ



చెన్నపురి:

ళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

 [*Price Rs.* **0-50**

శ్రీ రస్తు.

# దేశింగురాజుకథ.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1923

శ్రీ ర స్తు.

---

విఘ్నేశ్వరస్తుతి.

క. శ్రీకర ప్రమథగణాకర
ప్రాకటభవభయవిదూర పన్నగహారా
లోకానుగ్రహకారా
చేకొని రక్షింపుమయ్య శివసుకుమారా.

శ్రీసుబ్రహ్మణ్యస్తుతి.

క. శరవణభవ వరసుందర
కరుణాకర దీనపోష కామితఫలదా
వరశక్తిధారి షణ్ముఖ
సురమునినుత ధన్యగణ్య సుబ్రహ్మణ్యా.

మహేశ్వరస్తుతి.

క. ఇందుధర సుందరాంగా
కుందేందుచ్ఛవితురంగ కుజనవిభంగా
బృందారకహృత్సంగా
మందస్మితవదన బ్రోవు స్మరహర లింగా.

శ్రీమహావిష్ణుస్తుతి.

క. కమలాప్త కమలనేత్రా
కమలోద్భవవినుతపాత్ర కర్బురజైత్రా

కమలాప్తకులపవిత్రా
క్రమముగ రక్షించు నీలకంధరమిత్రా.

బ్రహ్మదేవునిస్తుతి.

క. నలినోద్భవ చతురానన
విలసితసృష్టిప్రకారవేది విధాతా
జలజాక్షనాభిపంకజ
కలితాంతర్వర్తి దిక్ప్రకాశితకీర్తీ.

శ్రీలక్ష్మీ గౌరీ భారతులస్తుతి.

క. శ్రీ గౌరీ భారతులన్
బాగుగ నే జాల దలంతు భక్తితో నెపుడున్
సాగిలబడి నుతియించెద
వేగమె రక్షించుకొఱకు వేడుక లలరన్.

తే. సకలదేవత లెల్లను సంభ్రమమున
ప్రకటితంబుగ గొనియాడి భవ్యముగను
రంగుమీఱ [illegible] సింగురాజుకథను
చెప్పెదను నేను లోకప్రసిద్ధిగాను.

క. ఇలలో గలబుధు లీకృతి
గలతప్పులు దిద్ది మీరు గాంభీర్యముగా
వెలయంజేయుగవలె నని
చెలువుగ గోరెదను మిమ్ము సిద్ధముగాగన్.

శ్రీ ర స్తు.

# దేసింగురాజుకథ.

-❀❀-❀❀-

## కథాప్రారంభము.

శ్రీకరముగ గణనాథుపదములు చెలువుగ సేవించి
ప్రాకట పద్మజురాణిని చాలా భక్తితోడ దలఁచి
ముదముతో హరి హర పరమేష్ఠులను మదిలో నర్చించి
సదయులైన శ్రీ గౌరీవాణుల సంప్రీతితో నెంచి
వరకవు లగు నా వాల్మీకాదుల వందనములుచేసి
గురుతరముగ సద్గురువుల నెల్లను గోర్కె బూజచేసి
ఈవసుధను పెరుగుమిపురవాసుఁడ నింపుమీర నేను
రావూ వేంకటసుబ్బయాఖ్యుఁడను రంజితంబుగాను
సంతసమున దేసింగురాజుకథ చక్కఁగఁ జెప్పెదను
వింతగ నీభు[illegible] [illegible]ను నిది విస్మయ మందగను
సురపతినారదసంవాదం బిది చోద్యంబుగ నిపుడు
వరుసగ నది యెట్లన్నను చెప్పెద సరవితోడ వినుఁడు

-❀❀- దేవేంద్రుఁడు కొలువై యుండఁగా నారదుఁడు వచ్చుట. -❀❀-

నాకాధిపుఁ డగుపాకారియు తా నధికభోగమునను
తేకువతోడను సింహాసనమున తేజరిల్లఁగాను
సురగరుడోరగసిద్ధసాధ్యులు సూటిగ గొల్వగను
సరగున రంభాద్యప్సర లప్పుడు సరసత నాడఁగను

మురియుచు ఫణిపతు లెల్లను గొడుగులు గరిమెతో పట్టగను
పరమాద్భుతముగ కిన్నరు లెల్లను మరిమరి పొగడఁగను
దంబుమీాఱ తుంబురునారదులు సంబరమున బాడ
జంభభేదికొలువున ఋషులెల్లను సంభ్రమంబుతోడ
ఉండఁగ నారదుఁ డొకనాఁ డచటికి నొప్పుగాను రాగా
దండిగ కొలువుననుండి యింద్రుఁ డా తపసిజూచి వేగ
నమ్రుండై తా నర్ఘ్యపాద్యములు నతిభక్తితో నిచ్చి
సంభ్రమ మొదవగ నాతని నుచితాసనమునందు నునిచి
సామి మీార లీ మూఁడులోకములు సంచరింపఁబూని
భూమిని గలవింతలు దెల్పం డిపు డేమైనాగాని
వినగోరెద మీావాక్యపద్ధతిని వీనుల వేడుకగా
మనమలరఁగ నేచోద్యములుండిన మాకు దెల్పు వేగ
అని సురపతి యానందంబున సమ్మునివరు నడుగఁగను
తనమది బొంగుచు నింద్రునితో నా తపసి యిట్టులనెను

నారదుండు దేవేంద్రునితో దేసింగురాజుకథ జెప్ప నారంభించుట.

సురనాయక యొకరాచ్చోద్యము విను సొంపుమీాఱ నిపుడు
పసువడి తెల్పగవచ్చితి నీకును పరమప్రీతి నేడు
స్థిరముగ భువిలో నేబదియాఱు దేశంబుల నుండు
పరమప్రసిద్ధము హైదరాబాదు పురమనె గోల్కొండ
ఢిల్లీపాచ్ఛా యేలుచుండె మరి సల్లలితంబుగను
ఎల్లలోకులకు నధిపతియై తా నేకచ్ఛత్రముగను
ఇంపుగ నేలుచు నుండఁగ జరిగిన యితిహాసము నేను
సొంపుగ జెప్పెద విస్తరంబుగా చోద్యం బంతయును
అన నమ్మునిశేఖరుతో నింద్రుం డప్పు డిట్టులనియెఁ

మునినాయక నీపలుకులు సంతస మొనఁగె బల్కుమని యెఱ
విను సురనాయక భూమండలమున వెస మేరువునందు
మునులు పలువురు తపములుసేయఁగ ముదమొదవగ నందు
ఘనుఁడు మహాత్ముఁడు గోగుపకీరీ యనుతపసియు తాను
మనములరగ ఘనతపమును జేయుచు మంత్రతంత్రములను
తెలిసి సిద్ధుఁడై యుండఁగ నచటికి దేవలోకమం దుండి
విలసితబారాహజారి రాగను వెలుఁగుతోడ నుండి

గోగుపక్కీరి ఢిల్లికి గుఱ్ఱమును తెచ్చుట.

మేఘమండలమునందు తిరిగెడు మేటితురంగమును
లాఘనమున బట్టఁగఁదలఁచియు నా ఘోడా పోవగను
చూచి మంత్రతంత్రంబులచేతను చోద్యంబుగ వశపఱచి
ఆచి పట్టుకొని ఢిల్లికి వేగమె యతిమోదంబున నడిచి
వచ్చి యొక్కచో డేరా వేసి పరులకు దెలియకను
అచ్చటనుండి చుట్టును పహారా మెచ్చుగ నుంచగను
అప్పుడు బారాహజారి గర్జన గొప్పగఁజేయఁగను
తప్పక ఢిల్లిలో గల జనులందఱు తడబడిమూర్ఛలను
చెందిన పాచ్ఛా విని యప్పుడు తా సందేహించుచును
ఇందుగలిగిన ప్రళయం బేమో యిది తెలియఁగవలెను
తొమ్మిదిమేఘము లొక్కట గర్జన తొడిబడఁజేసినదో
ఇమ్మహిగలుగు సముద్రములెల్లను యిటు ఘోషించినదో
అని మది నెంచుచు నతివేగంబున తనతక్తుకువచ్చి
ఘనుఁడౌబడేదివాణ్జి రాజలింగబాబు నటుగాంచి
వావోయి వింతలు గనఁబడెనేడు రాజలింగబాబు
రావముగలిగిన దదియే మిప్పుడు రాజలింగబాబు

గర్జనజేసిన దేమది జెప్పుము ఘనుడలింగబాబు
భర్జింపుము నీ విప్పుడు దానిని పరగలింగబాబు
అనఁగా విని యారాజలింగబా బప్పు డిట్లులనెను
మనవిది వినుమా పాచ్చా యిప్పుడు మరిచెప్పెద నేను
గోగుపక్కీరి యనువాఁడిట కొక గుఱ్ఱము దెచ్చె నేఁడు
బాగుగ దివ్యహాయంబును దెచ్చెను పట్టుపడదు చూఁడు
మంత్రతంత్రములచేతను దానిని మచ్చిడి తెచ్చినాఁడు
యంత్రంబులచే వశము జేసుకొని యిటకు వచ్చినాఁడు
ఎంతటిధైర్యము గలవారైనను యెక్కలేరుదాని
వింతగనున్న దటన్నను పాచ్చా వేగచూచె దాని.

పాచ్చా గోగుపక్కీరికి బహుమానము లిచ్చి గుఱ్ఱమును తీసుకొనుట.

సంతోషముతో నప్పుడు పాచ్చా చయ్యన ఫక్కీరికి
కొంతధనంబును బహుమానంబులు కొల్లగ నిచ్చి పురికి
హాయమునుగొని తా తెప్పించియు లాయములో గట్టించి
నయమున గోగుపకీరి నప్పుడే నచటనుండి యంపించి
వరువడి రాజలింగబాబును పాచ్చా వటుచూచి
వరుసను నందఱు పాళెగాండ్రను త్వరలో రప్పించి
ఈగుఱ్ఱము నెక్కెడువారల కిక బహుమతు లిప్పించు
బాగుగ యెక్కనివారల ఖైదులో వేగమె పెట్టించు
అని సెలవిచ్చిన రాజలింగబా బరకారుల నంపఁగను
పనివడి పంపిన హరకార్లేగి యనువుగ జెప్పఁగను
వచ్చిరి హాయమునుజూచుటకై యా పాళెగాండ్రందఱును
మెచ్చుగ నాగుఱ్ఱంబునుజూచి యెక్కలేము మే మనెను
అందఱుఖైదులో నేడువర్షము లమరగ నుంచుమనెా

యుందిక నెవ్వఁడు రాజలింగబా బిప్పుడు తెల్పుమనెఁ
మనవియొక్కటి విను మిక పాచ్ఛా మరి చెప్పెద నేను
ఘనులౌ రాజులు గల రనేకులు కనుఁగొన భువిలోను
ప్రవిమలమతు లగు రాజు లందఱు పరగ యెక్కలేరు
అవితథశౌర్యులు నతిశూరులు యీరా హాయము నెక్కలేరు
ఇప్పుడు దక్షిణదిక్కునకుంజని హెచ్చుగాను గలదు
గొప్పకోట దుర్గంబును నచ్చట నొప్పుగాను గలదు
తనరగ చెంజికోటను యేలే తరణిసింగురాజు
తనయులు యిద్దరు శూరసింగును ధరణీసింగురాజు
శూరసింగుఁడును ధరణిసింగుఁడును సొంపు చెంజికోట
వారలిద్దఱును యేలుచుందురు వదలక నానాఁట
శూరసింగునకు సమానశూరులు వేరే లేరెచట
ధీరవరుం డగుధరణిసింగునకు దీటుగాన మెచట
బహుశూరులు యీరా ఖారహాజారిని పటుగతినెక్కుదురు
సహజంబుగ వా రిద్దరు గుఱ్ఱము చక్కనెక్కగలరు
అనఁగను విని హరకారుల నచటికి నతిశీఘ్రముగాను
పనివడి బంపుము రాజలింగబా బనువుమీరగాను
అంతట రాజలింగబాబు తా హరకార్లను బిలిచి
సంతసమున నా చెంజికోటకును జాబు వ్రాయ నెంచి
పెద్దకరణమును రంగపిళ్లను బిల్వమనుచు బంచి
వద్దచేరి యారంగపిళ్ల యటు పాచ్ఛావును గాంచి
సలాంచేసిన రంగపిళ్లను చక్కగాను జూచి
సలాం బదులుచేసి పిళ్లను చయ్యన నటుగాంచి-ఓ
రంగపిళ్ల నీవిప్పుడు చెంజికి వ్రాయవలెను జాబు
సంగతులన్నియు దెలియఁజెప్పెదను సరగ వ్రాయుజాబు

—శూరసింగురాజునకు పాచ్ఛా జాబు వ్రాయుట.—

సలాం శూరసింగురాజ వో సలామయ్య నీకు
బలేశూరులని మిమ్ము గాంచుటకు పరగబుద్ధి మాకు
కలిగియున్నది మాపై మీదయ కలుగవలయు నేడు
సలలితముగ రావలె నిచ్చటికిని చయ్యనను యిపుడు
సతతంబును రాజులనంపజేని సమ్మతి జూచితిని
మతిమంతుల మిము జూడగవలె నని మరి యిపు డంపితిని
అని యీరీతిని వ్రాసిపంపుము వినయము రంగపిళ్ల
అన నాతఁడు జాబు వ్రాసెను విని యాసంగతులెల్ల
జాబు తెచ్చి హార్కార్పాపయతో సవిస్తరముగాను
బాబువారిగా తెలియజెప్పి యట పంపు వేళలోను
యేనూరామడదూరము చెంజికి యీఢిల్లికి నిపుడు
పూని తపాలాగుఱ్ఱము లేనూరు పొందుగ నుంచుకొని

.... .... .... ....

మరి చెంజికిపోవోయి నీవిపుడు హారకార్ పాపయ్య
చెంజికిపోయి శూరసింగు నిటు తేవలె నడిగాను
రంజితమ్ముగా పోయి నీవిటు రమ్ము జల్దిగాను
తడయక హార్కార్ పాపయ్యప్పుడు తపాలమార్గముగా
వడిగా నప్పుడు పాతచెంజికిని వచ్చెను వేడుకగా
శూరసింగుఁడును కొత్తచెంజిలో సొంపుకొల్వులోను
ధీరులయిన తనమంత్రులగూడుక తేజముఁ బరగాను
ఉన్నకొల్వునకు హార్కార్ పాపయ తెప్పున దావచ్చి
సన్నుతుఁడగు యా శూరసింగును చయ్యన నటుగాంచి

—హార్కార్ పాపయ్య శూరసింగునకు జాబు వ్రాయుట.—

వినయముతో హార్కార్ పాపయ్య వేడ్క సలాం జేసి

చనువుతోడ యాశూరసింగునకు జాబంతటదీసి
సొంపుగ నిచ్చిన హరకార్ నప్పుడు శూరసింగుజూచి
పెంపుతో యెవ్వరు బంపవచ్చితివి పే రే సున లేచి
అప్పుడు సలాముచేసిపల్కెను హరకార్ పాసయ్యా
చెప్పెద నిప్పుడు సంగతులెల్లను చెలువుగ వినవయ్యా
హెచ్చుగ ఢిల్లీపాచ్చా మిమ్మును యిపుడు చూచుటకును
అచ్చటికిని మిమ్మును తెమ్మనగా వచ్చినాను నేను
జాబుచూడగా నన్నిసంగతులు సవిస్తరముగాను
బాబువారిగా దెలుసునుమీకు బరమముసంబునను
అనిన తమ్ముఁడగు ధరణిసింగును నంత తాను పిలిచి
తనచేజాబును చదివి తెల్పుమని తమ్మునిచే నిచ్చి
ఇచ్చినజాబును చదివి సంగతు లేర్పడ దెల్పఁగను
ముచ్చట విని యాకొలువున జనములు మురియుచు వినగాను
తనమంత్రులజూ చప్పుడుబల్కెను దనరచోద్యముగను
వినరయ్యా వోమంత్రులార యీవివరము జెప్పెదను
ఘనుడగుపాచ్చాపునుజూడఁగను గడుప్రీతిని నేను
మనమలరగ యాఢిల్లికి పోయి మరలిటువచ్చెదను
వచ్చుదాక యీరాజ్యము మీరే వదలక చూచుకొని
యెచ్చుగ నిచ్చటికార్యము లెల్లను యింపుగానుపూని
చేయుచు నిచ్చటిసమాచారములు శీఘ్రంబున నాకు
వాయ కప్పటప్పటికి తెల్పుఁడు పరగ నేను మీకు
చెలువుతోడ నాసంగతులెల్లను తెలియఁగఁ జేసెదను
యెలమితోడ నే పోయివచ్చెదను యింక పేష్కగాను

—శూరసింగు తన భార్యనద్దికిఁబోవుట.—

అని తనమంత్రుల సమ్మతిపడిచి యంత తాను లేచి

మనమలరగ యానగరకు నేగి తనసతి నటు గాంచి
సతి విను మొక్కటి నేను చెప్పెదను చయ్యన రాంబాయి
హితమతితోడను నీకు దెల్పెదను ఇప్పుడు రాంబాయి
రయమున ఢిల్లీపాచ్ఛా నన్ను రమ్మనె జల్దిగను
నయముతోడ నే బోవలె నిప్పుడు నచ్చటికిని యికను
ఇచట భద్రముగనుండుము నీవు యిప్పుడు రాంబాయి
అచటికిబోయి జాబుర్వా సెదను యిచటికి రాంబాయి
పరఁగఁబోయివచ్చెద ననిచెప్పిన ప్రాణనాథుతోను
సరగునరాంబాయి చింతనొందుచును చయ్యన నిట్లనెను
దేవరవారికి నేను యిప్పుడు తెలియఁజెప్పగలన
సావకాశము లేదిక ప్రసవ సమయం బిది యనిన
కరుణతోడ రాంబాయినిజూచి కలకలనవ్వుచును
మరి నీ కేమిటు తక్కువయున్నది మగువరో యిచ్చటను
పాయక దాదులతోడనుండుము భద్రం బని లేచి
పోయివచ్చె దని తమ్ముని నంతట పొందుగానుజూచి
వేయుగుఱ్ఱములతపా లుంచుము వేగ ధరణిసింగు
చేయవలసిన జాగ్రత లెల్లను జేయు ధరణిసింగు
అనిన తమ్ముఁడును శూరసింగుఁడు నంతజల్దిగాను
ఘనసత్వములౌ హయముల నెక్కి కదలి రంతలోను
త్వరలో ఢిల్లికివచ్చి చేరిరి తపాలమార్గముగా
ధరలోగల్గినరాజు లెల్లను తప్పక వచ్చిరిగా
పాచ్ఛాకొల్వులో శూరసింగుఁడును బహుధైర్యముతోను
అచ్ఛాయనుచును పాచ్ఛావుకు తా నపుడు సలామునెను
బదులుసలామును చేసిచూచెను పాచ్ఛా వప్పుడును
మదిసంతసమున శూరసింగునకు మర్యాదలతోను

వచ్చినరాజు లెల్ల కొలువులో వరుసనుండగాను
అచ్చట గూర్చుండగనియమించె నయంబుగ నిద్దఱను
ఢిల్లీపాచ్ఛా శూరసింగునకు మర్యాదలుచేసి పిలిపించినకార్యమును దెలుపుట.
శూరసింగుని పాచ్ఛా వంతట చూచి పల్కెనపుడు
వారక నందఱు రాజులువిన నొకపలుకు బల్కినాఁడు
వినుఁ డోదేశాధీశులార యొక వివరము నిప్పుడును
పనిపడి మిముబిలిపించినకార్యము బాగుగ దెల్పెదను
దేవలోకగుఱ్ఱం బొక టిక్కడ తేజరిల్లుచును
యీవసుధనుగల గుఱ్ఱంబులలో నిది యెక్కువగాను
ఉన్నది దాని నెక్కినవారికి నుచితంబుగ నిపుడు
పున్నచేసి వారిపాళెమును మరియిచ్చెద నేడు
కొన్నియినాములతోడను వారికి గుఱ్ఱమునిచ్చెదను
యిన్నికార్యములు గల విక్కడ మీ యిష్టంబే మనెను
ఆమాటలువిని రాజులందఱును అతిమోదంబునను
ప్రేమతో గుఱ్ఱమునెక్కెడికోరికై తాము లేవగాను
ఘనశౌర్యులు నగునారాజులఁగని కలకలనవ్వుచును
కనుఁగొని వారల పాచ్ఛా వప్పుడు గ్రక్కున నిట్లనెను
—ఢిల్లిపాచ్ఛా రాజులతో ప్రతిజ్ఞ సేయుట.—
ఏ నొకమాట చెప్పెద వినుఁడీ యిపుడు రాజులార
పూని గుఱ్ఱమును యెక్కినవారికి పొసఁగ రాజులార
ఘనముగు బహు బహుమతులనిత్తును మనములరఁగ నేను
ఘనులని వారినిమెచ్చి ప్రియంబున కౌఁగిటఁజేర్చుదును
ఆగుఱ్ఱముపై నెక్కనివారిని అతికోపముతోను
వేగముగా నై దేండ్లదాకను వేతు ఖైదులోను
అనఁగావిని యారాజులందఱు నపుడు సమ్మతించి

మనముల సందేహించుచు నుండఁగ మరి పాచ్ఛా లేచి
వచ్చెను రాజులతోఁ గూడుకొని చెచ్చెర నంతటను
అచ్చట బారాహజారి గనుఁగొన నతిభీకరముగను
అంతట బారాహజారిగర్జిల నష్టదిగులుజెంది
గంతులువేసినమాత్రములోన కడుభీతియునొంది
మిన్నువిరిగి పైఁబడినటు రాజులు మేదినిపైఁబడిరి
కన్నులుచెదరగ తలలువంచుకొని కడువడి చింతిలిరి
గడగడవణఁకుచు మూర్ఛలదేలుచు కాళ్లుచు కడువడిగా
తడబడనందఱు యేమియుఁదెలియక తారుమారుగాఁగా
అప్పుడు పాచ్ఛాపనుగనుఁగొని వా అంప రిట్టులనిరి
చెప్పలేము యీగుఱ్ఱముమహిమను అప్పయేమొ యనిరి
ఇప్పుడు నుహారా జీగుఱ్ఱము మే మెక్కలేము యికను
తప్పక యెక్కిన ప్రాణము నిలువదు తనయక మాకికను
దేవలోకగుఱ్ఱముపై నెక్కను దేవతలేగాని
యీవసుధలో గలవారికిఁదగునా యీగుఱ్ఱముపూని
ఎక్కలేము యీగుఱ్ఱముపైని నిక్కముగా మేము
గ్రక్కనప్రాణంబులతోనైనా హైదునునుండెదము
అనునామాటలు తా విని పాచ్ఛా వంతట నవ్వుచును
ఘనముగ భూమీశులతో పల్కెను వినుఁడనుచును తాను
ఎంతోశూరుల రనుచు మిమ్ము నే నిచటికి రప్పిస్తి
యింతటిధీరుల రగుటవహ్వామీ చెంతనె సరిచూస్తి
నక్కకైన మీయంతటిశౌర్యము లెక్కింపఁగరాదు
దిక్కులేని పాడూరికినెన్నఁగ నక్కపోతురాజు
మేకపోతుగాంభీర్యంబని నే మేదిని వినియుంటి
దాకలాయ నామాట యిపుడు మీ చాపుగ నేగంటి

పురుషచిహ్నములుదాల్చినషండుడు పొలతుల నేలుటయుఁ
అరయ నటులనగు మీ రిబారాహజారి నేలుటయుఁ
బిడ్డయునైనను జూచి మీరాయటులు భీతియుజెందదుగా
తెడ్డయినను యీ తేజిగర్జనకు దిగు లిటు నొందదుగా
అని యిటు లోకులుపల్కెడువాక్యము లవి వృథగానయ్యెఁ
చెనకిచూడగా నిది తెరగని మా చిత్తము గననయ్యెఁ
బలేబలేవస్తాదులు మీరే వహ్వారేయనుచు
చలోచలో తుం ఖైదుకు నిపుడే శీఘ్రము బొమ్మనుచు
వరుసగ రాజులరెల్లరు నైదువత్సరంబు లిటను
సరవితో ఖైదులోనుండివెనక నిరు సంవత్సరములును
ఊరక నిచ్చటనుండియు నావల పూరికిపోవలెను
సారెకుపాచ్ఛా యిట్లనిపల్కిన నమ్మతినందఱును
నిండుఖైదులోనుండి వారలనెలవుకు జాబులును
ఖండితంబుగా సంగతులెల్లను కనుపడ వ్రాయఁగను
వెతలబొందుచును వేవిధంబులను విధి గడుదూరుచును
అతివ్యసనంబున గుందుచునుండిరి అప్పుడు నందఱును
అటుల నారదుఁడు దెల్పగ నింద్రుం డత్యద్భుతముగను
పటుతరముగ మునినాథ దెల్పితివి పరనుముసంబునను
అవతలివృత్తాంతం బేమాయెను నారద నాకిటను
ప్రవిమలముగ నది దెల్పునున్నను పరమమోదమునను

## ఇంద్రునకు నారదుఁడు చెంజిపట్టణవృత్తాంతముదెల్పుట.

విను సురనాయక చెంజిపట్టణపు వృత్తాంతం బికను
ఘనముగ నీ కే దెల్పెద నిపుడు కలవృత్తాంతమును
చెంజివిడిచి యాశూరసింగఁడు చేరఁగ ఢిల్లీకిని

రంజితముగ నట యేడునాళ్లకు రాంబాయికిని
పుత్రోత్పత్తియు గలిగిన నందఋ భూరిసంతసమున
నేత్రోత్సవముగ పట్టణమెల్లను నెరిశృంగారమున
భేరీభాంకారాదివాద్యములు భోరుగొల్పగాను
వారటుచక్కెర పంచి రప్పుడు వరుసతో వీథులను
పరమముదంబున వచ్చినవారికి బహుసుతులను ఇచ్చి
యరయగ గొలువుననున్నజనులకు నట యినాములిచ్చి
పుత్రునిజూచి సంతోషంబున పొంగెను రాంబాయి
గోత్రరక్షకుం డీతఁడని తాను కోరెను రాంబాయి
బాలుఁడుపుట్టిన యిరువదిదినమున పరగఢిల్లినుంచి
చాలతపాలలోవచ్చినజాబును చయ్యన నటుగాంచి
శూరసింగుఁడు ఖైదులోపడ్డ సొబగులు తలపోసి
సారెకు వగచుచు విధినిదిట్టుచును సతి పతిదలఁచుచును
కూరిమిపుత్రుఁడు కలిగినప్పుడు మీఁగులేక నిటను
తారుమారుగా నున్నదిగాదా తగుపని జరుగకను
పురుషుఁడులేని యిల్లేటికి కాపుర మిక నేమిటికి
పురుషుఁడులేని సొబ గేమిటికి మోదం బేమిటికి
పురుషుఁడులేని విభవం బేటికి భోగం బేమిటికి
పురుషుఁడులేని పుర మేమిటికి పుత్రుం డేమిటికి
పురుషుఁడులేని జీవన మేటికి భువిబ్రతు కేమిటికి
పురుషునిబాసిన జన్మ మేటికి శిరులుం డేమిటికి
బాలునిముద్దులపలుకులు వినగను పరగప్రాప్తిలేక
చాలగ చిన్నికుమారుని నెత్తుగ సరగ గాంచలేక
ఈతనయుని దా కండ్లజూచునో యెటులున్నదో కాని
ధాత్రవ్రాలు యీతీరుననుండిన తప్పునె యేరికిని

మంచిదికానీ యెట్లులనైనా పతియువచ్చుదాక
మించినవేడుక నీకుజ్జుని నే బెంచుచుందుగాక
అనుచును రాంబాయి వ్యసనమువదలి తనయుని జూచుచును
ఘనమగు సంతోషముతో బెంచుచు కడుప్రీతిగ దాను
జాబులువ్రాసెను విభునకు నప్పుడు చయ్యన ఢిల్లికిని
జాబుచూచుకొని సొరసింగుఁడు సరగ వ్యసనమూని
ఉండగ చెంజిలో దేసింగుబాలుం డొప్పుగ వేడుకను
రెండు మూడు నా లైదు నెలలు నటు నిండినయంతటను
బోర్లబడుచును జరుగుచు నంతలో పొల్లుతప్పడిలుఁచు
మెల్లనె నడుచుచు దుముకుచు వ్రాలుచు మేలుగ పరుగిడుచు
కుప్పిగంతులను వేయుచు సఖులతో కూడి చదువుకొనుచు
అప్పుడు తల్లిదగ్గర కొచ్చి యాకలాక లనుచు
పాలుచక్కెర తెమ్మని తల్లిని పలుమా రడుగుచును
పాలుపాలని తల్లిని జేరి పయ్యెద పాకుచును
చన్నొసంగుమా యమ్మా యని బల్ సద్దు లొనర్చుచును
క్రన్నన రంతులు చేసి ముదంబున చన్నులు ద్రాగుచును
మేలుగ తన సమసఖులతోడను మెలఁగుచు తిరుగుచును
వాలాయంబుగ మహమత్ ఖానుని వదలక గూడుచును
తల్లిదగ్గరకు జేరి యమ్మ మా తండ్రేడీ యనుచు
మెల్లనలేచి వెలపటికొచ్చి మేటిపనులు గనుచు
అల్లకల్లోలము జేయుచు నూరిలో నెల్లవారి కలను
సల్లలితంబుగ నీతివిద్యలు చయ్యన చదువుచును
సహజము మహమత్ ఖానుతో గుజ్జుపునవారి చేయుచును
కహాకహానవ్వుచు కన్నతల్లి నటు కన్నులఁ జూచుచును

అంతట మహమత్ ఖానునిగూడి యట పరుగెత్తుచును
చెంత నున్నకొండలపై నెక్కియు చయ్యన దుముకుచును
పంతములాడుచు గుండుల నెత్తి పరగరువ్వుచును
గంతువేసి నిండేటిలో నావలిగట్టుకు దాటుచును
పందెముచే నొకగుక్కకు మూడు పరువులు బాపుచును
సందేహించక పెద్ద మ్రాకులను సరగున పెరుకుచును
పులుల సింహముల నెదిరించుకొని పోడిచియు చంపుచును
తలచుక నొకదినమందున తండ్రిని తల్లిని నడుగుచును
ఇటువలె నైదేండ్లాడుచు నొకనాడింపుగ తల్లితోను
పటుతరముగ మాతండ్రి యేడీ యని పలుమారడుగగను

—దేసింగుతల్లి యతనితో శూరసింగువృత్తాంతము చెల్పుట.—

తనయు నెత్తుకొని ముద్దుబెట్టుకొని తా నిట్టుల ననియెన్
విను కుమార మీతండ్రి శూరసింగని తెల్పఁగదొణఁగెన్
పనిబూనియు మీతండ్రిని ఢిల్లీపాచ్ఛా వచ్చటను
విను మేడేండ్లటు ఖైదులో బెట్టిన విధమును దెల్పెదను
దేవలోకమందుండి యచటి కొక తేజిరాగ నాఁడు
యీవసుధను గలరాజుల నెల్లను యెలమి బిలిచినాఁడు
ఈగుఱ్ఱంబును యెక్కినవారికి యినాము లిచ్చెదను
బాగుగ నెక్కనివారిని ఖయిదులో పరునడి నుంచెదను
అని చెప్పిన యారాజులు బారాహజారి నటుజూచి
ఘనమగు భయమును జెందుచు మనముల గడుచింతిలి చూచి
సలామయ్యా బహుసలాము పాచ్ఛా సలామయ్యా మీకు
బలేగుఱ్ఱ మిది యెక్కగూడదు భయముకలిగె మాకు
అనఁగా పాచ్ఛా రాజులనందఱ నట ఖైదులో నుంచెన్

మనమున బొక్కుచు తనయుని గని యొకమాట మందలించె
పినతండ్రియు మీతండ్రియు నిద్దఱు వినుము నాటనుంచి
తనయా ఖైదులో నున్నా రనఁగా తా నటు కోపించి
పండ్లు పెటపెటని కొరికె నప్పుడు బాలుఁడు దేసింగు
కండ్లు వుఱుముచును కోపము చేసెను ఘనుఁడగు దేసింగు
రెండుగడియలకు లోపల ఢిల్లిని పిండిగ జేసెదను
పండితుడైన యాగుఱ్ఱము నెక్కి దవుడాయించెదను
అనుచు తల్లికిని దండము బెట్టి యమ్మా యిప్పుడును
ఘనముగ నాకు మంచివుత్తరము గ్రక్కున నీవలెను
ఇప్పుడు ఢిల్లికి వడి నేగియు నే నెక్కియు గుఱ్ఱమును
తప్పక తండ్రుల నిద్దఱి దెచ్చెద తల్లీ వినుమనెను
జల్దిజల్ది వుత్తర మిమ్ము జల్దిగాను తల్లి
జల్దిగాను నే బోయివచ్చెదను సెలవొసగుము తల్లి
అని చెప్పిన యా తనయునిజూచి యంత వ్యసనమునను
వినరా ముద్దులతనయా మరి నీ విటుల బల్కితేను
కనిపెంచిన నాగర్భము చల్లన గాంచు టెట్టు లేఁకను
నిను విడిచియు యరగడియైన నే నెటుల నుండఁగలను
అనుచు చేతులు పిసుకుకొనుచు తా నంత మూర్ఛజెందె
ఘనశోకంబున నేలబొర్లుచును కడువ్యసనము నొంది
ఉన్నతల్లిని దేసింగుఁడు తా నొప్పుగాను జూచి
కన్నుమూసె నా కిదిసమయంబని గ్రక్కున తా లేచి
పరగ శంకరాభరణమేటిలో స్నానంబును జేసి
పనుపడి రంగేశునిసన్నిధికి భక్తితోడవచ్చి.

దేసింగు శ్రీరంగనాథుని స్తుతించుట.

పన్నగశయనా పంకజలోచన పద్మనాభ రారా

చెన్నుగ నిను నే నమ్మితి నిప్పుడు శ్రీరంగా రారా
కరుణాకర శ్రీనరహరి రంగా కామితఫలవరదా
కరి హరిహరి యని మొరలిడ విని చని కరుణింపఁగలేదా
మునుప్రహ్లాదుని నేలినకరణిని బ్రోవఁగ దయరాదా
ఘనముగ నలనా డాధ్రువుగాచిన గతి నేలఁగరాదా
అనాథరక్షకా దీనజనావన సనాతనా నిన్ను
వినాగ వేరే దిక్కులేదు నా మనవిని విని నన్ను
ఘనంబుగను నాయండ నుండుమని గ్రక్కున వేఁడితిని
మనంబునను నిను ముఖంబునను నే మరిమరి మ్రొక్కితిని
రంగనాయకా నేను ఢిల్లికి రయమున పోవలెను
సంగతిమీరగ ఢిల్లిలో గుఱ్ఱపుసవ్వారి చేయవలెను
తండ్రుల ఖయిదులో నున్నవారిని తడయక తేవలెను
తండ్రి నీవని నమ్మితి నాపై దయయుంచగవలెను
సమ్మతిమీరఁగ నాకు సహాయము సరగున రావలెను
నమ్మి మిమ్ము నే ఢిల్లికి పోయెద ననుచు వేఁడగాను
చయ్యన దేసింగునితో రంగస్వామి యిటుల ననెను
అయ్యా వినరా దేసింగా నీ కతిసహాయముగను
వచ్చెద పోయి రమ్మని చెప్పిన ముచ్చటతోడుతను
హెచ్చుగ మహామత్ ఖానుని జూచి యచ్చటివిధములను

### దేసింగురాజు మహామత్ఖానునితో గూడి ఢిల్లికిపోవుట.

తప్పక చెప్పియు మన మిద్దఱము తగ ఢిల్లికినేఁడు
తెప్పునబోవలె ననఁగా మంచిది దేవర యన్నాఁడు
మనకు రెండుగుఱ్ఱంబుల దెమ్ము మహామత్ఖానుఁడ
మనఖర్చులకును రొక్కము లెత్తుకొ మహామత్ ఖానుఁడ

అనుచును దేసింగుఁడు బల్కఁగ నా మహమత్ ఖానుఁడును
వినయంబున నాకార్యము లన్నియు విశదరీతిగాను
తడయక నప్పుడు తనమది బొంగుచు తయారుచేయఁగను
వడిగలగుఱ్ఱము లెక్కి యిద్దఱును వడిగా పోవఁగను
పదిదినంబులకు జేరిరి ఢిల్లీపట్టణ మప్పుడును
పదిలముగా నా పాచ్ఛాకొలువులో వచ్చి నిలిచి యటను
మండివేసుకొని సలాంచేసెను మరిపాచ్ఛావునకును
పండితుఁడగు బాలునికిని పాచ్ఛా బదులుసలా మనెను
రాజాధిరాజులందఱును రయమున జూడఁగను
తేజంబునుగల రాజసింహుని ధీరుని బాలకుని

—— పాచ్ఛా దేసింగురాజువృత్తాంతమును విచారించుట. ——

పాచ్ఛా వప్పుడు చూచి బాలుని పరమాశ్చర్యమున
అచ్చాబహాదర్ తుంకో ననఁగా నట దేసింగుఁడును
సారెకు పల్కెను పాచ్ఛాతోను సరగ జెంజియేలు
శూరసింగునితనయుఁడ నేను సొంపుగ నామేలు
తప్పకవిను నే దేసింగుఁడ మా తండ్రులు నిద్దఱును
యిప్పుడు నీఖైదులో నున్నారని చెప్పఁగ నిట నేను
వచ్చితి బారాహజారినెక్కఁగ వచ్చితి నిట నేఁడు
చెచ్చెరగను నాప్రతాప మిప్పుడు చేజేత నెచూడు
చెప్పనేల యాబారహజారిని శీఘ్రమె తెచ్చినను
తప్పక స్వారీచేసియు నీమది మెప్పుజేతు ననెను
అన నామాటలు విని యాపాచ్ఛా యాశ్చర్యముజెంది
ఘన సామాన్యపుగుఱ్ఱము కాదది కటకట యని గుంది
లేచివచ్చి యాబాలుని ప్రియమున జూచి ముద్దుబెట్టి

ఆ చిత్రము దా నేమనిచెప్పుదు నెందుగాన మిట్టి
ఏమ యేంక్లై యీ బాలుం డెంత యారా హాయమెంత
కాదు వీనిచే నెక్కుట కరిమశకాంతర మిది వింత
పిల్లమాటగా దోచలేదు మరి పెద్దమాటగాదు
కల్లమాటగా దోచలేదు నిక్కమ్ము దోచలేదు
ఈ బాలకుని వాక్యం బిప్పుడు యిది నిజమని యెంచి
ఆబారాహజారి నిచ్చటికి నారయ రప్పించి
చూపినంత యీ కుఱ్ఱడు దాని చూచియు నేమునో
బాపురె చూపక నున్న నప్పు డీ బాలుం డేమనునో
యెంచినచింతతో పాచ్ఛా విట్టుల నెంచెను తనలోన
ముంజెయికంకణ మరయుటకు న్నిట ముకురముకావలెన
చల్లకొసంగను వచ్చి ముంత దాచంగ నేల మనకు
కల్లనిజంబులు రెండు నిప్పుడే గనెద క్షణంబునకు
అని యిటు లని యాపాచ్ఛా వప్పుడు నా దేసింగునకు
ఘన గుఱ్ఱము చూపించునంతలో తన తనయునిపలుకు
అన్ని యానవా లన్నిసంగతులు అన్ని తాను దెలిసి
చెన్నుమీర యా శూరసింగు దేసింగుని నటు గదసి
ఏరా చిన్నికుమారా నీవిట కేలవచ్చి తౌరా
వూరకె నిను మీత ల్లిటువిడిచి యోర్చియున్నదటరా
నాకులదీపమ నాసుకుమారా నాదుతండ్రిరారా
నీకై దేంట్లకు యిచటికిరాగా నేకత ముండెనురా
అనిన తండ్రితో దేసింగుడు తా నప్పు డిట్టులనెను
ఘనముగ బారహజారి నెక్కియు గ్రక్కున మిము నేను
చెఱవిడిపించి పిలుచుకపోవను మఱి వచ్చితి ననియు
సరసంబుగ నిటుపల్కి తండ్రితో జనపతి గనుగొనియు

ఏలయ పాచ్ఛా నుఱచితిరేవో యింతలో మీమాట
కాలయాపనము చేసుటమేలా కనుమిక నామాట
నాపరువును యాబారహాజారి పరువు నెఱుఁగలేక
బాఁపట్లను మీ కింతయోచన యెందుకు యిందాక
ఆరయ శునకము లెన్నేనియును హారికిని సమమవునా
బారహాజారు లెన్నేనియు నా బాలాసమమవునా
బక్కగుఱ్ఱమును పెట్టుకనేమో నిక్కెదేల బహుళా
చక్కనిఘోడా యైతే చూపుము యెక్కెద భూమీశా
అందఱ మోసం బొందించిన యాచందం బిదిగాదు
ముందుగ గుఱ్ఱము దెప్పించుము నా ముందర నికమీఁదు
తెప్పించకనుండితిరే నిఁక నీ దేశాధీశులకుఁ
అప్పణ యిచ్చిన యాజ్ఞ యెవరిదో యారయ దేవరకుఁ
పరిపరివిధముల బాలుఁడు పలికిన పాచ్ఛా నవ్వుచును
సరగున నెల్లఁగ గూడుక నాహాయశాల కరుగగాను
చూడగ గుఱ్ఱము గర్జనచేసిన సొంపుశబ్దమునను
తోడనె రాజుల గుండెలుపగిలెను పోడిమిచెడి చాటను
కోట యిడిసిపడినట్టు లుండెను వీటివారి కపుడు
సాటిగ మేఘంబులగర్జనవలె సరగ దోఁచె నపుడు
చెవులు ఘుమ్మఘుమ్మనగా రాజులు చయ్యన మూర్ఛిలిరి
దిగులుజెంది వారంతయుపుడమిని తేకువచెడి పడిరి
శూరసింగుఁడు నవనీతమ్ముఁడును సొలసి తలలువంచి
బీరముచెడి బల్ బెడగున నప్పుడు బెదరియుండఁ జూచి
తెంపున మహామత్ ఖానుని జూచి దేసింగుం డనెను
తెంపుచు గాడిపిచాడిగుఱ్ఱమును తెమ్ము వేగమునను
తెప్పున గుఱ్ఱంబునకు బంగరు జీనివేసి తెమ్ము

తప్పక వప్రాల్ చెక్కినకళ్లెము త్వరగవేసి తెమ్ము
అని చెప్పిన యీ మహామత్ ఖానుం డటులచేసి తేగా
తనమదిబొంగుచు దేసింగుఁడు తేజిని తట్టి పట్టి వేగా

దేసింగురాజు బారాహజారి నెక్కుట.

కనకనమనుచును గర్జన చేయఁగ కదసి కళ్లియమును
ఘనశౌర్యంబున బట్టి గుఱ్ఱమును కడువడినెక్కగను
సింగమువలె తా నెగసె నంత దేసింగుం డంతటను
భంగము ప్రాణుల నొందించెడి పులిభంగి నెక్కె నటను
బాలుఁడైన దేసింగుఁడు హయమును వడిగ నెక్కఁజూచి
జాలి జెందుచును తహతహపడుచును చాలచింత వగచి
శూరసింగుఁడు తమ్మునితోడను సుతునొద్దకు వచ్చి
బారహజారి నెక్కుట జూచి పరువడి నెద మెచ్చి
మన్ననతోడ కుమారుని గనుఁగొని మనమున గుతించి
కన్నుల నీరును నించుచు నప్పుడు కటకటపడి చూచి

దేసింగు బారాహజారి నెక్కగా నతనితండ్రియు పినతండ్రియు గుఃఖించుట.

తనయా నీ వీగుఱ్ఱమునెక్కగ తగదిక నిటరారా
చనువుతో పాచ్ఛాచే సెలవుగొని చనుదమిపుడు రారా
అనిన తండ్రితో దేసింగుఁడు తా నప్పు డిట్టు లనియెన్
ఘనమగుగుఱ్ఱము నెక్కగ భయపడ కైదులో మిమ్మిపుడున్
పెట్టియుండ నే నెక్కియు గుఱ్ఱము ప్రీతితోడ మిమ్ము
దిట్టముగా విడిపింపఁగవచ్చితి తవిరి నేఁడు నమ్ము
ఊరకెపోయిన నవ్వరె శూరులు పోనఁగ తండ్రులారా
నేరక గుఱ్ఱము నెక్కకవదలను నిజము తండ్రులారా

స్వారీచేసి వచ్చిననన్ను చక్కజూడరయ్యా
వారించకుడీ గుఱ్ఱముచే బడ వగవనేల నయ్యా
ఖించి మనంబున చింతిలవలవదు మీరు తంద్రులారా
మంచినవారీ చేయఁగవలెనే నెంచ తంద్రులారా
పుట్టినప్పుడే చావు నిజంబని పొసఁగ తంద్రులారా
దిట్టముగా మీ మనముల నమ్ముఁడు తెలిసి తంద్రులారా
అని యిటుపల్కి సలామును జేసి యపుడు నిలిచినాఁడు
పనిబూనియు గోవిందా యనుచును పరగ జూచినాఁడు
అంతలోన నాశూరసింగుఁడు నటు తనయుని జూచి
యింతచేసుటకు నేల పుట్టితివి యిపు డని మది పగచి
తొలుతను బుట్టినయప్పుడె చచ్చిన దుఃఖము లేదయ్యా
యొలమితోడ మీతల్లి యిపుడు ని న్నెట్లు పదలెనయ్యా

దేసింగుఁడు గుఱ్ఱము నెక్కి దవుడాయించుట.

కలఁతజెంది యేమయ్యెనో యనఁగా కదలిచె గుఱ్ఱమును
జలిదీ యనుచు దవుడాయించెను చయ్యన బాగుగను
పటపటపటపటపటపట యనుచును పరువులెత్తె నపుడు
చిటచిటచిట యని యెడమకాలికి చిమటయిచ్చినాఁడు
పోయెపోయెనని రాజులందఱును పొక్కుచు జూడఁగను
వోయయ్యా నీ వెందుబోయెదని యొప్పుగ బిలువఁగను
వాయుమార్గమున నెగయఁగ నప్పుడు వదలక గుఱ్ఱమును
పాయక మేఘమండలమందు పారెడుగుఱ్ఱమును
నారాయణ గోవిందా యనుచును కోరికలైనపుడు
వారిజాక్ష హరివరదా యనుచును [illegible]
గరుడునివలె నా గుఱ్ఱము పోడవుగ కడు వేగముగా [illegible]

వురవడికలిగిన వాయువువలెనే వొప్పుగాను సాగెన్
కొండలనెల్లను మెండుగ దాఁటుచు గొనకొని యెగయుచును
చెండువిసరుచు గంతులువేయుచు చెలఁగి మురుంగుచును
అడవులఁ దిరుగుచు మ్రాకుల ద్రోయుచు కడువడి దాఁటుచును
తడవుగ దిరుగుచు తలక్రిందుగ బల్ ధాటిగ బఱువుచును
గాడుపడి యట సింహములెల్లను గదలక దిగబడియెన్
గూడుల నుండక పక్షులెల్లను గొబగొబ యని పరవెన్
సురలెల్లను దేసింగుపరాక్రమ మొప్పుగ గాంచుచును
సరగున బారాహజారిపఱచెడి చతురత మెచ్చుచును
అంతట గుఱ్ఱము నాలుగుదిక్కుల వింతగానుతిరిగి
పంతంబున నాఁ డేనూరామడ పరగ దిరిగితిరిగి
ఇటువలె గుఱ్ఱం బైదుదినంబులు యెచ్చుగాను చెలఁగి
తటుకున బాలుపరాక్రమంబును తనమదిలో నెఱిఁగి
ఈబాలునిచే బలహీనము నా కిపుడు గలుగు ననుచు
స్వాభావికమును విడిచి మాయలో సంచరింతు ననుచు
మేరుపర్వతము చెంతను వీనిని మెలఁగి త్రోసెద ననుచు
నా రెకు తలఁచియు వెతలబెట్టఁగా చయ్యన తాఁ గనుచు
తివిరి నిద్ర యాహారము లేకను దినంబు లైదయ్యెన్
దివమును రాత్రియు నొక్కట దిరుగుట తేజీ హీనుఁ డయ్యెన్
కన్నులు గిరగిరదిరిగి శోషచే కడుభీతినిదూఁగెన్
పన్నగశయనుని రంగనాథుని పరుపడి దలఁచుచును

{ దేసింగు బారాహజారిని పంచుకోజాలక [illegible]
రంగనాథస్వామిని ధ్యానించుట. }

కళ్లెము గట్టిగ బిగబట్టుకొని గడుసు తేజిపైని

మెల్లన మెడ తనచేతుల జుట్టియు మొదలకొందుకొని
రక్షింపుము రంగేశా నను సంరక్షింపుము లోకేశా
పక్షివాహనా పరమపవిత్రా పన్నగశయన సురేశా
వారిజనాభ జనార్దనాచ్యుతా వాసుదేవ శౌరీ
సారెకు భయమును జెంది నిన్ను నే సన్నుతింతు కోరి
భజియించెద రక్షింపుము నన్ను పరమమహామునినుతా
గజవరదా నను బ్రోవవె స్వామీ కారుణ్యముచేతా
జయజయ భక్తజనావన బ్రోవుము జయజయ శ్రీరంగా
జయవిజయాభవ దిగ్విజయాభవ జయ గరుడతురంగా
సుజనగణావన దుర్జనమర్దన సుందరతరవదనా
విజయహృదయకమలాంతరవాసా వేదవేద్యసదనా
దశరథనందన దశముఖభంజన తాటకసంహరణా
పశుపతినందన పన్నగశయనా పంకజమృదుచరణా
శరణుజొచ్చినను యరమర జేతుర సరగున నిటురారా
శరణుశరణు యోకరుణాసాగర కరుణింపఁగరారా
బిరానరారా వరాలొసంగ శ్రీకరా యిటుల రారా
పరాకేలరా పరాత్పరా శ్రీధరా యిటుల రారా
సకలచరాచరసముదయములకును సముడనఁగనుబరఁగి
సకలేశుఁడవై సర్వాత్ముఁడ వకలంకుఁడవై చెలఁగి
లేదా దయ యికరాదా శ్రీదామోదర యిటు రారా
వాదా బ్రోవగరాదా నీచే గాదా రఘువీరా
ఏదయ నీదయ యేదయ రాదయ సాదరముగ రారా
ఓదాశరథే యోదయానిధే యోకృపాళ రారా
మోసబుచ్చి యాహాయ మెచ్చుటికో తీసుకపోఁదలఁచి
వాసిగనున్నది యిదుగో నిను నే వరుసగ మదిఁదలఁచి

## రంగనాథస్వామి దేసింగునికి ప్రత్యక్షంబై రక్షించుట.

భజనచేయు చున్నాడని వేఁడఁగ భక్తపరాధీనుఁడు
విజయముచేసి దేసింగునితో వెరవకుమని యపుడు
గజిబిజిబారెడి గడుసుహాయంబును కడువడి బోనీక
హాజరతొప్పెకుమ మిక జెల్లదు నీ యహామడంతుగాక
చిన్నిబాలుని చిక్కులబెట్టెడి చెడుగుఱ్ఱమ యిపుడు
మన్నించియు నీయున్నతి నణఁచి తిన్నగ నను మిపుడు
పన్నగశయనుం డని నన్నెఱుఁగుము పలువ యనుచు నపుడు
సన్నుతమునినుతుఁ డగురంగేశుఁడు చెన్నమీఱ నపుడు
కన్నులు చెదరఁగ పెట్టుపెట్టినను ఘనమగు గుఱ్ఱంబు
మిన్నువిరిగి పైఁబడ్డటు నిలిచెను మేటిగుఱ్ఱమపుడు
బాలుని బారాహాజారి నీ విటు భంగపెట్టఁదగునా
చాలుచాలు నీజవము దెలిసె నిఁక చనఁగా నిట్లగునా
బాలుని నీవు ఢిల్లికి దీసుక పరువునబో మ్మికను
బాలకుండు నాభక్తుని వీని భయపఱుపక నికను
కొన్నిదినంబుల కీబాలునిచే గోర్కెదీర నీకు
సన్నుతమౌ యుద్ధంబు నొందవును చయ్యన నట నీకు
మోక్ష మిచ్చెదను జల్దిగ పొమ్ము మునమొపనఁగ ననిన
నాక్షణంబునను ఢిల్లిసమీపం బౌమార్గము గనిన
బాలుని లేపి రంగనాయకుఁడు పటుదయతోడుతను
మేలువరంబు లొసంగియు ధైర్యము మెప్పుగ జెప్పఁగను
అప్పుడు దేసింగుఁడు రంగేశున కతివినయంబునను
తప్పగ సాగిలిమ్రొక్కి మిక్కిలి ధైర్యంబున తాను

నరహరి శ్రీహరి మురారి శౌరీ నన్నిప్పుడు చేరీ
మరలిచి తెచ్చితి మార్గము దప్పక మధుకైటభహారీ
శరణుశరణు నిను నమ్మితినయ్యా శరణు రంగనాథా
కరుణతో నీదాసుని నను బ్రోవుము శరణు రంగనాథా
అని నుతియించిన దేసింగునితో నపుడు స్వామి యనియెా
ఘనుఁడగు ఢిల్లీపాచ్ఛా నిన్నుడు కను వేగమె యనియెా

—దేసింగు రంగనాథుని యనుగ్రహంబున ఢిల్లిచేరుట.—

మనమలరగ బహుమతులు గైకొని మరి తండ్రులతోను
చనుము చెంజ కని రంగస్వామి చయ్యన బోయినను
అప్పుడు బారాహజారి పాదుషా హజార మటు చేరి
తప్పక గర్జన సేయఁగ నందఱు తడబడి యట దేరి
చిన్నికుఱ్ఱ నాగుఱ్ఱంబును గని కన్నులనీ రుంచి
అన్నరార నామున్ను వేగ నాకన్నరార ముంచి
సూరసింగుఁడు బిడ్డను ముద్దిడి చుంచుదువ్వగాను
హారతులెత్తి దృష్టితీయుఁడని యానందముతోను
ధీరుండగు బాలుని తా గనుఁగొని దృఢమతితో పాచ్ఛా
కోరికె లడుగుము నిన్ను మెచ్చితిని కూర్తు నీకు అచ్ఛా
మ్లేచ్ఛుండని నన్ మెచ్చక నుండకు మేలొనర్తు చాలా
స్వచ్ఛుండా నీచరితము మేలు సమకూర్చెను బాలా
నీశౌర్యంబును నీబలమును నేనిప్పు డెఱింగితిని
కేశవభక్తుల కెప్పుడు భీతియు లేశము గలుగదని
పాచ్ఛా పలుకుచు నుండఁగ తనమది పరమాశ్చర్యమొంది
స్వచ్ఛుండా సత్కీర్తిని గాంచిన సజ్జన పెనుపొంది
ఉండుము నీ వని సూరసింగుఁడును వొప్పుగ దీవించి

దండిమీరగా సంచను నెత్తుక తనతొడపై నుంచి
నేను చేసినపూజ లన్నియును నేడు సఫలమయ్యెగా
కానరానియాపదలు వచ్చియు కడగ దొలఁగిపోయెగా
అనగా నచ్చటిరాజు లెల్లను అతిముదమును జెందగా
ఘనుఁడగుపాచ్ఛా నాకుమారుపై కడుసంతస మందెగా
మేలని బాలుని సింహాసనమున మెలకువతో నుంచెగా
చాలగ నాలింగనమును జేసి చయ్యన లాలించెగా

ఢిల్లిపాచ్ఛా దేసింగురాజునకు బహుమతులు చేయుట.

రాజలింగబాబును నట చూచి రయమున ని ట్లనెను
రాజసింహుఁడౌ దేసింగునకు వాజులు లక్షయును
మూడుకణజముల రొక్కము నిటకు ముందుగ దెప్పించు
యేడులక్షల మదపుటేనుఁగుల నిప్పుడు రప్పించు
సకలసేనలను దాసీజనముల చయ్యన నిప్పించు
ప్రకటితముగ భూషణవస్త్రంబుల పరఁగ నందు నుంచు
అని యీతెఱఁగున నాజ్ఞాపించఁగ నపుడు వేగమునను
చనియును రాజలింగబాబు తా సరగున కొలువైనను
దేసింగునికి పాచ్ఛాచెప్పిన తెఱఁగున రొక్కమును
వాసిమీరగ గుఱ్ఱంబులు గజములు వరభూషణములును
దాసుల దాసీజనముల భటులను తగు పెక్కోటులును
వాసవలోకపుగుఱ్ఱంబును మరి వరవస్త్రంబులును
అప్పుడు తెచ్చిప్పించినపాచ్ఛా యతనిజూచి మెచ్చి
తప్పక చెంజి యినాము యేలుమని యప్పుడె సెలవిచ్చి
నవరత్నంబుల కంఠహారములు నతనిమెడను వైచి
ప్రవిమలరత్నకిరీటము నప్పుడు బాగుగ నిప్పించి

బహుమతు లున్నతి నటుపలె చేసి పట్టుశాలువలును
సహజంబగు ప్రేమంబున నిచ్చియు చాలామెచ్చియును
తనగుఱ్ఱంబగు నీలవేణిని తటుకున దెప్పించి
ఘనుఁడగు మహామత్ఖానున కప్పుడు కడువడి నిప్పించి
కొన్నియినాములు మహామత్ఖానుని కోర్కెదీర నిచ్చి
మన్ననజేసియు నిద్దఱఁజూచి మరి మదిలో మెచ్చి
చయ్యన రాజలింగబాబును నెయ్యమొకవ జూడక
ఒయ్యన నపు డాతనితో నాతఁడు వోహో వినుమనియెక
రమ్ము వీరితోఁగూడిపోయిరా రాజలింగబాబు
రమ్ము చెంజికి సేనల బంపుము రాజలింగబాబు
రాజులందఱును చాలాదినములు రాయిడిబడి చెడిరి
తేజనెపంబున గావున వీరిని తెప్పునవిడు జారి
అని తమతమయే లేక్షి పరగణా లైదువత్సరములు
ఇనాము లిదిగా ననుభవింపుఁడని యిమ్ము పుత్త్రగురువులు
వెరవుమీరఁగా నిటువలెజెప్పఁగ సరగున నాతఁడును
పసువడి నట్లనె చేసెను పాచ్ఛా వహ్వా యనఁగాను

దేసింగురాజు తండ్రులనుబిలుచుకొని బారాహజారితోడ చెంజికి వచ్చుట.

మరి దేసింగుఁడు తండ్రులతోడను మహామత్ఖానునితో
త్వరలో దమతమగుఱ్ఱము లెక్కియు తరలిరి సేనలతో
పదిదినములలో చెంజికి జేరిరి బహువేడుకగాను
మదిసంతసమున నూరివారలు మరిమరి పొగడఁగను
వచ్చినబాలుని జూచుచు నుండిరి పరుసగ నందఱును
ముచ్చటతో దేసింగునితల్లి ముదముమీర గనెను
ఎత్తిప్రీతితో ముద్దులాడుచును యేమిర నాతనయా

చిత్తమెప్పుడును నీపై నుండెను చిన్నినాదుతనయా
ఇన్నిదినంబులు నెచ్చటనుండితి వేమిర సుకుమార
చన్నులపాలు చేపె నిప్పుడు చయ్యన సుకుమార
అనుచును సుతునకు హారతులెత్తెను అప్పుడు రాంబాయి
చనువునద్రుష్టియు దీసెనప్పుడు సరగున రాంబాయి
ఆదేసింగుడు నందఱిగూడుక యంతఃపురమునను
ఆదరమొప్పఁగ తల్లిచెంతను మోదముతోడుతను
యువరాజుగ నా దేసింగుని వారొప్పగ రావించి
ప్రవిమలకీర్తి యొసంగ వెలయుమని పట్టము గట్టించి
ఏకొదవలు లేకను బాగుండఁగ నేడోవర్షమున
ఆకుమారుని తల్లిగతించిన నంతట దుఃఖమున
పొగలుచు పరలోకక్రియ లెల్లను బుధులు మెచ్చగాను
తగనొనరించెను దేసింగుడును ధర్మరీతిగాను
బాలుని కష్టసువత్సరంబున పరమపదంబునకు
కాలవశంబున శూరసింగుడు కడఁగి పోవ నటకు
చుట్టములెల్లను వచ్చి వగవ నా శూరసింగునకును
అట్టియొనర్చెను పరలోకక్రియ లందఱు మెచ్చఁగను

## దేసింగురాజు రాజై రాజ్యపరిపాలనంబు సేయుట.

సరగున దేసింగున కప్పుడు పురజనులును మెచ్చగను
ధరణిసింగుఁడు పట్టముగట్టెను శ్రద్ధయు ప్రియమునను
చనువున జనముల పరిపాలించెను చయ్యన నాతఁడును
ఘనమతి దేసింగుని భూషింపఁగ గడగిరి యెల్లరును
ఇటుల కొన్నిసంవత్సరంబులును యేగగ నంతటను
తటుకున ధరణిసింగుఁడు మంత్రుల తా బిలుపించియును

## ప్రభువా దేసింగునకును పెండ్లి సరగ జేయవలెను

—దేసింగురాజునకు సరణిసింగు వివాహంబు చేయించుట.—

సభగలవారలు నందఱుగూడి చయ్యన నిష్టుతను
ఆలోచనలను సేయఁగవలయును అతిగూఢంబుగను
బాలుం డయ్యును బుద్ధినుంతుఁడు పరఁగ జూడఁగాను
మన దేసింగుకు పెండ్లిచేయవలె మంత్రులార మీరు
మనపట్టణమును శృంగారింపుఁడు మంత్రులార మీరు
ఇష్టం డటంచును ధరణిసింగుఁడు హితవుమీరఁగాను
తప్పక పల్కఁగ నట్లానర్చిరి యిష్టుమీరఁగాను
సరగ నప్పుడే చారులవలనను ధరణిసింగురాజు
అరయఁగ నా దేసింగువిమాటను ధరణిసింగురాజు
విహితముగా నప్పుడు రప్పించియు వేడ్కమీరఁగాను
మహినొప్పంగ మన దేసింగునకు మదిముద మొదవఁగను
పెండ్లిసేయగావలె నని మేము పెద్దల గూడుకొని
పెండ్లికూఁతురు యెవరని మనముల పెరతలఁపులు మాని
మీపుత్రికను తెచ్చి వివాహము యేపుమీర జేయఁగ
యీపట్లను నిశ్చయము చేసితిమి యింకదడవు జేయఁగ
మీరుచెప్పిన మేరకు జేయఁగ మేము సిద్ధముగను
చేరియు నున్నారము యిప్పుడు మీకోరికేమి యనను
వినియు నాతఁడును నందున కొంసఁబడి వేడ్కతోడ నపుడు
తనపురంబునకు నరిగియు వృత్తాంతంబు లెల్ల నపుడు
ఎల్లవారికిని తెలియఁగ జెప్పి యుల్లమలరగాను
సల్లలితంబుగ పుత్రిని దోడ్కొని చెంజి చేరఁగాను
అకలంకం బగుప్రీతిని నెదురుగ సకలబాంధవులును

సకలజనంబులు సంతసించఁగా సవరించంతటను
సడునగ ధరణిసింగుఁడు వచ్చి విడుదులు జూపించి
కడు మేలును నగు సుముహూర్తంబున కల్యాణము జేసి
బంధుమిత్రులను బ్రాహ్మణజనముల బాగుగ మన్నించి
సైంధవమ్ములు గజములు రథములు సరగ వారి కిప్పించి
మరియునుగల్గిన సటభటాదులును సరిమురి ప్రియమంద
సరగ నొనర్చియు ధరణిసింగుఁడు చాల వేడ్క నొంద
దేసింగునిమామయు తా నంతట దివ్యరథంబులును
వాసిమీర గుఱ్ఱంబులు గజములు వగుసధేనువులును
కూతున కరణం బిచ్చియు తనదగు గృహమును జేరుటకు
ఖ్యాతిగ నేగెను బంధులవీడ్కొని కడువడి పురమునకు
అంత సంతసంబున దేసింగుఁడు ఆర్యుల గొలుచుచును
పంతముమీరగ పరిపాలించెను బంధుల మిత్రులను
శూరీతిని సుఖ మొందుచు చెంజిలొ సారెకు సందటను
భూరిసంతసం బొందుచుండె రని నారదుఁ డనఁగాను
విని సురనాథుం డతిమోదంబున వేడ్క లుప్పతిలఁగా
ఘనుఁడగునారదు జూచి పల్కెను కడుప్రీతితొ వేగా
ఆవలికథ యేమాయెను దెల్పుము అన బోనమునామి
సావధానముగ జెప్పెద వినుమా సకలము జేజెసామి

{ ఢిల్లీపాచ్చా తనకొమార్తెను సాదుల్లాఖానుని కిచ్చి పెండ్లిసేయించుట. }

సంతోషంబున ఢిల్లీపాచ్చా స్వంతకూఁతురికిని
అంతట పెండిలి చేయఁగవలయు నని దలఁచెను మదిని
తనప్రధానియౌ రాజలింగని తప్ప కవుడు జూచి

ఘనముగ పెండ్లి సేయఁగ మనమున కిడు నిశ్చయ ముంచి
ఉన్నవాఁడను పట్టణమెల్లను వొప్పుగ వేడ్కగను
యెన్నోవిధముల శృంగారింపఁగ యిపుడు బంపు మనెను
కనకమయంబులు మణిమయములు నై కడుశోభిల్లఁగను
దినకరు తేజము మీరుకాంతిని తేజరిల్లఁగాను
వాద్యఘోషములు మ్రోయుచుండఁగను వరుసవీథులందు
చోద్యముగా నగ రెల్లను మరిమరి సొగసుజేసి యందు
సాదుల్లాఖాసాహేబు నప్పుడు చయ్యన బిలిపించి
మోదముతో తనపుత్రిని వానికి ముదమున పెండ్లియొనర్చి
అల్లునికిని కూఁతురికిని యప్పుడు అధికధనము లిచ్చి
కొల్లలుగా నేనుంగులు హయములు కోర్కెదీర నిచ్చి
కోరినవస్త్రంబులు భూషణములు కొంతసైన్యములును
వారికి దాసీదాసజనంబులు వరరత్నంబులును
వ్రాసియిచ్చెను ఫర్మానా యొకరాజ్య మేలు మనుచు
వాసిగ కూఁతురి కల్లునకిచ్చియు వరుస వేడ్కజూచు
నూటయెనిమిది పాళా ల్తుకుడీ నేటుగజేయించి
వాటంబుగ తనకూఁతురి కరణము దీటుగ నిప్పించి
సాదుల్లాఖానుం డగు తనయల్లుని చక్కగాను జూచి
మోదముతో నార్కాడు నేలు మన ముదముతోడ వచ్చి
సాదుల్లాసాహేబుయెంతో సంభ్రమంబుతోను
ఆదరముగ తనవారితో గూడి యార్కా డ్జేరగను

## సాదుల్లాఖానుఁడు ఆర్కాడుయిలాకాకు ప్రభువగుట.

ఏడులక్షల పఠాణీలను యేరుపఱచె నపుడు
వాడిమిగల తేగాబరిశీలను వారికిచ్చెనపుడు

ఖావన్సమీరులను రప్పించియు పట్టము కట్టించి
ఖావళ్యం బైనట్టి కేతనము తప్పక నెత్తించి
ఖాన్లేయలేరహీమాన్ తురుపులు భర్తీచేయించి
ముల్లాశాస్త్రము పద్ధతి వారికి మూలము దెల్పించి
నమ్మకహరాంనైకర్నా యని నమ్మికపుట్టించి
ఉమ్మరుఖాన్ అనియెడి వానిని వుజీరుగా నుంచి
బారకాసు బంగాళా లయునులు బాగుగ గట్టించి
చాదుఫనా పరిచేడిగోడలు చాలుగ బెట్టించి
ఢిల్లీమకా దర్వాజాలు ఠీవిగ నేర్పఱచి
ముల్లాఫీరు హిమామువద్లు మూలల గావించి
తక్తుమహాలు బల్ శాడీమహాడీ దర్బారుగ నుంచి
యుక్తముగాను దివానుఖానా లూర్జితంబు జేసి
వీథివీథులను మసీదులెల్లా వెల్గుచుండఁగాను
బాదరువుం రావ్రాఖాజిల్ నమాజు జేయఁగాను
యగఫయిఅల్లాఖుదా యటంచు నచట వేడఁగాఁను
నిగనిగమని కందీలు గుళోబులు ధగధగవెలుఁగఁగను
ధాటిగనవలాక్తోట బెట్టి బాహాటముగాగాను
నేటుగ తాను కోటజేరి బల్పాటము మీరఁగను
రోజీనాలు కై జీతములు రూఢిగ నిచ్చుచును
ఆజూబాజూ పల్లెలయందు అముల్దార్లనుంచుచును
సుబాయారికా జేలుచునుండే నబాబుసాదుల్లా
సభామధ్యమున తాగూర్చుండి జాగ్రతతో నెల్లా
కిల్లేదారుల జాగ్రత జూచి కిలకిల యని నగుచు
ఒల్లేయినాము లప్ప డిప్పించి బైటోజీ యనుచు
తాజ తవాజము లివ్వఁగాను తానే ప్రభువుగను

నాజర్ మొదలగు నుద్యోగస్తులు నయముగ గొల్వఁగను

—— సాదుల్లాఖానుఁడు పరగణాలెక్కలు తనికీజేయుట. ——

నౌకర్లనుజూ చప్పుడు బల్కెను నబాబుదొరగారు
లీకావటుయూ ముసద్దీలను లెక్క లడిగినారు
సీమామూలపు జమీందారుల చెల్లుబాకిలేమి
జాములోపల తయారుచేసుక జాగ్రతగా రమ్మి
తువమొదలుగ లెక్కలు తా నెఱుఁగును తోండ్రమల్లోజీ
ముఖమున బిల్వఁగఁ బంపు డనంగను ముందుగానుఖాజీ
చోప్దారులను గనుఁగొని యప్పుడు జోరుగ నాతనిని
మాప్దలలేదు తోండ్రమల్లోజీ మలగకు వేగమని
తోడుకరం డని సాదుల్లాఖానుఁడు తుర్యముగా నపుడు
పోడిమితోడుత బల్కగ వారలు పోయి పిల్వ నపుడు
తమకంబున జోడంగీల్ దొడిగియు తలపాగా బెట్టి
నమూదుపైనా జల్తరుపట్కా నడికట్టుగ గట్టి
కొలువై యున్న నబాబుకడకును గొబ్బున వచ్చియును
సలాముచేసి భయభక్తులతో చెంగట నిల్వఁగను
తొందర వలదిఁక బైటో బైటో తోండ్రమల్లోజీ
ముందుగాను పాళెంబులబాకీ మొత్తము లేర్పఱచి
అరనిమిషములో బాకీలెక్కలు మొఱఁగ జెప్పు తఱిచి
దొరతోనప్పుడు సునవిజేసె నా తోండ్రమల్లోజీ

—— { తోండ్రమల్లోజి నబాబు కి స్తీనసూలులెక్కలు వివరముగా దెలుపుట. } ——

తప్పక లెక్కలు శోధించితిమి తప్శీలావారిగను
ఇపుడు నెంబరు చొప్పున మీకు యిక వివరించెదను

చేతిపట్టు దావుఖ్హాఁ బాకీ చెల్లియున్న దిపుడు
పాతపాళెపు జహాగీర్దారుఁడు బాకీ లేదిపుడు
కళ్ళకురంజిఖాఁసాహేబు కాసు బాకి లేదు
కళ్ళికోట మహమత్ ఖాఁ బాకీ చెల్లు బెట్టినాఁడు
అరియలూరి పాళేగార్బాకీ యరకాసును లేదు
తిరుణామలయేల్ సుభంగిదొరయును తెలియ బాకిలేదు
దిండికల్లు కొలుమొక్తాఁ బాకి తెచ్చి చేర్చినాఁడు
బండికోటయేల్ జాగీర్దారుఁడు బాకితీర్చినాఁడు
చెంగల్పట్టుజమీఁదార్ బాకీ చెల్లిపోయె నేఁడు
మంగళపేట సుబేదారుఁడు బాకి యిచ్చినాఁడు
వెంకటగిరి బంగారునాయుఁడు యింక బాకి లేదు
శంక లేక మళయాళపురూకలు సరిగవచ్చె నేఁడు
కలవకోటయేల్ సుబేదారుఁడు కాసు బాకి లేదు
చెలువుతో కాళహస్తి పైకము చెల్లించిరి నేఁడు
తిమిరికోటయేల్ షేకుమహమ్మదు తీర్చి వేసినాఁడు
అమరిన కార్వేట్రాజువారును అరయ బాకి లేదు
ఆరణి వేంకట్రాయలవారును అరయ బాకి లేదు
నారగంటిపాళెంబున బాకీ యారయంగ లేదు
మొగరాల్పాళెపు కిస్తీరూకలు ముందే చెల్లినది
మొగలిపాళెదార్పైకము మనకు తగరారన నేది
నిలిచినపాళాల్ పైకము బాకీల్ నేటివరకు లేదు
చెలువుగ కిస్తీకట్టలేదు దేసింగురాజువారు
చేయుచు పంద్రెం డేడులనుండియు చెల్లించడు పైకమును
ఈయెడ వానిని మట్టుబెట్టుట హితమని యనఁగాను
కన్నుల నిప్పులు రాల్చుచు మిక్కిలి యున్నతుఁడై యంత

పన్నుగ సాదుల్లాను౯ డుగ్రుడై పలికె వాని కంత
శాబాస్ వహ్వా బాగజెప్పి తీసారిపల్కవోయి
యీబాకీ క్షణమైనా నేసట యిఁకను నిల్వనోయి
అనుచు మీసము ద్దీటుచు హుకా నప్పుడు బట్టుచును
కనుబొమ లదరగ భుజములు గదలగ ఘనముగ బల్కుచును
గుప్పుగుప్పుగు ప్పని తనకన్నుల నిప్పులు రాలఁగను
అప్పుడు పండ్లను పెటపెటపెటపెట యనుచును గీటుచును

సాదుల్లానుఁడు తోండ్రమల్లోజిని సైన్యసమేతముగా చెంజికోట కంపుట.

మనకును పైకము కట్టకయుండే మదగర్వం బేమీ
తనకును చెంజీకోటయినాము దక్కన యికను సుమీ
అనుచు మంత్రియా తోండ్రమల్లుని కనుఁగొని తా నపుడు
దినములు మూఁడును గడువిచ్చితిమి తీవ్రముగా నిపుడు
చెంజికోటకును పోయి పైకమును శీఘ్రంబుగ దెమ్మీ
పంజరైన దేసింగుని నీవిటు పట్టి కట్టి తెమ్మీ
అని కోపముతో నబాబుసాదుల్ ఖానుఁడు పల్కఁగను
వినియును తోండ్రమల్లోజప్పుడు వినయముతో దుతను
పూని సలామటు చేసి నబాబును పొడగని యిట్లనెను
పూనికతో దుత చెంజికోటకును పోయివత్తు ననెను
మూఁడువేలగుఱ్ఱంబులరౌతులు నేడుపటాళములను
వాడిమిగల తేగాబరిశీలును జోడా భేరులను
ఏనుఁగులు౯ వి ల్బండ్లు నౌంటెలును హెచ్చు వాద్యములును
సేనాధిపులు ఖజానాదారులు నానావిధములను
సకలమైన సంభారంబులును చాల రొక్కములును
వొకటియు తక్కువలేకుండఁగ నా కొప్పుగ నిచ్చినను

శీఘ్రముగాను చెంజిలో మనకు జేయపైక మంత
జాగ్రతగా గొనివచ్చెద జూడుఁడు చాలఁగ నొకవింత
పట్టి కట్టెదను దేసింగుని బల్వారా లుంచెదను
గట్టిన నిర్బంధంబుతోడను ఖయిదీచేసెదను
మించినయధికారము వానైపై నడిపించెద నచ్చటను
మించియున్న నొకవేళలో వానట ద్రుంచెద తెగతోను
ఇటులపల్కిన తోండ్రమల్లుని యింపుతోడ జూచి
చటులపరాక్రము లయిన బలంబుల నరగ నివ్వ లేచి
తోడుగూడుకొని సలాముజేసి తోండ్రమల్లోజీ
వేడుకతోడను నుత్తరు వివ్వఁగ విడిదికి నతఁ డొచ్చి
నిలువంగీ ల్దొడిగియు తలపాగా నేర్పుగాను జుట్టి
జలతరుపేటుధట్టీ నడుముకు చక్కగాను గట్టి
తళతళమనుబేష్కబ్బానంతట ధట్టిలోన జెక్కి
నిలువుటద్దమును జూచి మీసముల్ నెరయదీటి నిక్కి
చేతుల బత్తినాయుధంబులను శీఘ్రముగా బట్టి
ఖ్యాతిగ నేనుఁగు నెక్కియు సేనను గదలగ నిలబెట్టి
పెంపుగ ధణాధణాధణాధణ యనఁగను భేరీ వేయించి
గుంపుగ పటపటపటపట యనఁగను గుఱ్ఱాల్ నడిపించి
కత్తులు ధగధగధగధగ మనుచును కాంతులు శోభిల్ల
తత్తరమందుచు నెల్లజనంబులు తరుగుచు భీతిల్ల
ఇలాతలం బిట్టట్టుగదలగా యేపుమీఱ వేగా
కలకలకలకలకలకల మనుచును కాల్బలములు రాగా
వేంద్రంబుగ బలముల నడిపించెను తోండ్రమల్లోజీ
తీంత్రించుచును గదలెనప్పుడా తోండ్రమల్లోజీ
అని నారదమునివరు డప్పుడు తా నానతియ్యగాను

విని దేవేంద్రుఁ డతనితోడుతను వెరగున నిట్లనెను
మునినాథా విన వింతగనున్నది ముచ్చట జూడఁగను
పనియేమీ యీనబాబు చెంజిపైక మడుగుటకును
కోరి ఢిల్లిలో దేసింగురాజు గుఱ్ఱముపై నెక్కి
సారెకు స్వారీ చేసినప్పుడు చయ్యన మదిసొక్కి
తెగువతో పాచ్ఛా చెంజియినాము దేసింగుని కిచ్చి
తగబంపఁగ నా దేసింగుఁడు తా మగుడ చెంజికొచ్చి
యేలుచునుండఁగ యీనబాబుకు యిపుడు బాధ్యమేమి
మేలని చెంజీపైకము నడుగగ మేరమీరనేమి
కారణమున్నది కడఁవడి దెల్పుము నారదమునివర్యా
కోరెద వినఁగా వారిచరిత్రము గొనకొని ధీవర్యా
ఇప్పుడన్న నాయింద్రుని జూచి యప్పు డిట్టు లనియెఁ
తప్పక నారదుఁ డావిధ మెల్లను తడయక వినుమనియెఁ
సురనాయక యా డిల్లిపాదుషా సొంపుమీరఁ గాను
గరిమెతో చెంజీ దేసింగునికి వరుస యినాముగను
ఇచ్చి మరచియు నల్లునికిని నూరెనిమిదిపాళెములు
మచ్చికతో ఫర్మానా వ్రాసి మరియు నిచ్చె మేలు
ధర్మమునెంచక తటుకున నప్పుడు తనమది మూఢతను
ఫర్మానాలో జేర్చెను చెంజియు పదపడి జూడఁగను
గరిమెతో సాదుల్ఖానుఁడు పైకము కట్టలే దటంచు
అరయగ దేసింగుని నడఁగుట కాదరు విదియే యనుచు
నారదుఁ డిట్లని చెప్పిన యా పాకారి మదిని యోచించి
సారెకు నల్లుని కెటువలె నిచ్చెను చయ్యన పాచ్ఛామెచ్చి
మరిచెప్పెదవిను సురనాయక యా తురకదొరతనమున
ఇరుకున దగులుట తెలియఁగలేరు యెట్టిదొరలునైన

అనిచెప్పిన మునివరుమాటలు విని యంత నింద్రుఁ డనియెఁ
చ నెనుగదా యా తోంండ్రమల్లుఁడా పని యేమిగ నయ్యెఁ
పూథముగా దెల్పుము నీ వనఁగా ద్రుహిణపుత్రుఁ డనియెఁ
గాఢము భేరీశబ్దము తిమిరికి కడువడి వినఁబడియెఁ

తిమిరకోట శేఖుమహమ్మదు తోండ్రమల్లునిజూచుట.

తిమిరికోటయేల్ శేఖుమహమ్మదు దిగులుజెంది లేచి
క్రమముదప్పి పరు లెవ్వరో మనపై గదసిరనుచు జూచి
మూడువేలగుఱ్ఱంబుల నప్పుడు మోహరంబు జేసి
తోడనె మున్నూర్ పఠాణిరౌతుల తోడుగాను జేసి
కత్తికట్టు కాల్బలముల నెల్లను క్రమముగాను నుంచి
బత్తీనాయుధములు తా నప్పుడు భర్తిగ ధరియించి
తానొక బారాహాజారి నెక్కక దండును గదలించి
పూనికతో జని తోండ్రమల్లుని పొందుగాను జూచి
ముందు సలాముచేసియు నిలిచి యందు సేమ మడిగి
తొందర సేయగవలవ నటంచును తోండ్రమల్లు నడిగి
మొన్నటివఱకును బాకీసొకల ముడుపంపితి నిన్న
నిన్నటిలెక్కలు యివె నన్నిప్పుడు మన్నించగదన్న
ఇదియునుగాకను నాపై తప్పులు యేమియున్న వన్న
కదలి యిపుడు నాకోటపైకిరా కారణ మేమున్న
అని యీవిధమున నడుగుచు భయమున నమగులు తడబడను
కొనియాడుచు మరి వేఁడెడి తిమిరి కోటమహమ్మదును
గజిబిజిమాన్పి తోండ్రమల్లుఁడు గ్రక్కున నిట్లనెను
నిజముగ శేఖుమహమ్మదు వచ్చుట నీపై గా దనెను
చెప్పెద వినుము చెంజియేలు దేసింగురాజు మనకు

తప్పక పంద్రెండేండ్లపైకము నిప్పుడు కట్టుటకు
మెండొడ్డియా నున్నాడిపు డాతని మేర దెలియనేఁడు
దండుతీసుకొని పోయెద నీకె నా తమాషైనచూడు
అనవిని శేఖుమహమ్మదుఁ డంతట నతిభయ మొందుచును
ఘనుఁ డగు నా దేసింగుప్రతాపము వినుమిఁక జెప్పెదను
బలమున నెక్కుడగలవాఁడయ్యా బాలుఁడు దేసింగు
ఎలమిని యెదిరించిన నిమిషంబున నణఁచు హానిపొంగు
కత్తిచేతబట్టిన జగమెల్లను గడగడ మని వడఁకు
మిత్తిరీతి వైరుల దా బట్టి మెలఁగనీక చెణకు
కండ్ల నురిమి చూచినమాత్రంబున గరుగు గర్భమున్న
పండ్లు పటపటని కొరుకునంతలో పరువెత్తుదువన్న
దుడుకడు రాజితసింహం బనఁదగు తోండ్రమల్లన్న
కడిమిని దేసింగుని యెదిరించుట కార్యము గాదన్న
అనవిని తోండ్రమల్లో జప్పుడు యేల యింతమాట
అనవచ్చునె నాముందర శేఖుమహమ్మదు నీ విచట
వినెదవుగా నే చెంజికిపోగా వీనులపండువుగా
కనెదవు నీ వీ మార్గంబుననే కదలిరాగ బాగా
వట్టిప్రతాపము లేటికి పోయి వచ్చెద మిదె వేగా

{ తోండ్రమల్లోజి తిమిరికోటనుండి ఆరణికిపోయి రణభేరివేయించుట. }

అట్లె దండు నడిపించెద నంచును ఆరణిమార్గముగా
పోయి యారణిపొంతకు జేరి పొసఁగ భేరిప్రేయ
మాయురె యీధ్వనియేమియటంచును మనమున దిగులొలయ
రయమున వేంకట్రావును శ్రీధర రావును నచ్చటను

నయమున శ్రీనివాసరావుతో నట చదు గుండియును
పిడుగురీతి నున్నది యీనాదము పెల్లుఘోరముగను
గడగడవడఁకెడు కాళ్లుచేతులును కడుభయ మొందెడును
కారణమేమో తెలిసియు వేగమె కట్టాయత్తముగా
బారహజారుల గొనితెం డిప్పుడె పటురయమున బాగా
అని యిట్లారణి వేంకట్రాయులు తనపరివారముకు
చనునటు లాజ్ఞ యొనర్చియు తాను సరగున కోటమహాల్కు
శ్రీధరరావు మొదలగువారితో శీఘ్రంబుగ నెక్కి
యీధర బగులగ భేరిమ్రోయుచు యేపుమీర నిక్కి
చూచుచు దిక్కులు పిక్కటిల్లఁగా సొంపుతోడ నపుడు
యేచివచ్చు సేనలధైర్యంబున జూచి వార లపుడు
పరాయిరా జిదె వచ్చెను కోట పైకి చూడుఁ డనుచు
పరాకులేకను బారహజారుల బిరాన తెం డనుచు
అప్పు డంపఋను తమతమగుఱ్ఱము లలవున నెక్కియును
తెప్పున బలములు తాము గూడుకొని తేకువ నడువగను
పదివేల్ రౌతుల గూర్చుక బందోబస్తిగాను తాను

—ఆరణివేంకటాద్రివు తోండ్రమల్లోజీని పొడగాంచుట.—

కదసియు వేంకటాద్రియులు తనచే కత్తిమెఱయగాను
ఎదురుగబోయి తోండ్రమల్లుని యేమరకను జూచి
యిదియేమీ యిటు రా కారణ మని యిపు డనుచును జూచి
తుదమొద లేమో మీవచ్చుటకును తోండ్రమల్లోజీ
సదయత జెప్పుము సంగతు లెల్లను చయ్యన మల్లోజీ
అనుచును వేంకటాద్రివునమస్కారంబు చేయఁగాను
వినయముమీరఁగ తోండ్రమల్లుఁడును వేగమె యంతటను

బదులు నమస్కారము తాఁ జేసియు కుదిరికెతోడుతను
చెదరక నిల్వగ వేంకట్రాయులు ముదమున నిట్లనెను
నిన్నటివఱకును లెక్కలు తీర్చియు నేను బంపినాను
ఎన్న నేటిపైకంబు ముల్లెయును నేఁడేసంపెదను
ఇటుల నుండఁగా భేరీవ్రేయఁగ నేమికారణంబు
తటుకున దెల్పుము తోండ్రమల్లన దాఁచకను నిజంబు
తోరంబుగ నాతని కిట్లనియెను తోండ్రమల్లోజీ
వేరే మేము వచ్చినవిధము వేంకటరావోజీ
చెప్పెద విను నే సవిస్తరంబుగా చెంజికోటలోను
ఒప్పుగ పండ్రెండేండ్లపైకము వున్నది యచ్చటను
కట్టలేదు దేసింగుఁడు మనకు కాసైనను యిపుడు
మట్టుమీరి యున్నట్టివాని దగు మదగర్వము నేఁడు
చూచి పైకమును దెచ్చుటకై నే సొంపుగ పోయెదను
నీచుఁడైన దేసింగుని బట్టియు నిటకు దెత్తు నేను
ఆమాటలు విని వేంకట్రాయులు నాతనిచర్యలును

తోండ్రమల్లోజికి ఆరణివేంకట్రావు దేసింగురాజు ప్రభావమును దెలుపుట.

సామాన్యం బని యెంచఁగదగ దిఁక చయ్యన చెప్పెదను
తల్లిదండ్రు లేడెనిమిదియేండ్లకె చెల్లిపోయినారు
పిల్లవాని పినతండ్రియు సాకి పెండ్లిచేసినారు
ఇరువదిరెండు యేండ్లవాఁడయా యిప్పుడు దేసింగు
సరియగుదురె సుందరమున భువిలో చక్కదనాల రంగు
గరిమెతో వానిపరాక్రమముల నీ కెఱుఁగ జెప్పెఁదేను
ఇరవుగ దేసింగునకును సరిశూరులెవరు లేరు యిఁకను
పదివేల్‌తులములయెత్తు కత్తిచే బదిలంబుగ దాల్చి

పదపడి తొమ్మిది వేలతురంగంబుల బాలా ధరియించు
మూఁడుమణుంగుల ఫేష్కబ్జా తన మొలధట్టిని జెక్కి
గాఢం బగు వుక్కుజిరా దొడుగుక మాఫిగాను నిక్కి
ధరగల వస్త్రాదులలోపలను తనకు మేటివాఁడు
అరుదుగ దేశాధీశుల కెల్లను అరయ పోటుగాఁడు
ధిక్కరించి చూచినమాత్రంబున నుక్కుగుండ్లు పగులు
చక్కగ నిలిచిన శూరులగుండెలు వ్రక్కలుగా నొగులు
దేవలోకమం దుండి వచ్చిన తే జతనికి గలదు
ఆవిధమంతయు దెల్పిన నెచ్చట నేవిన కన లేదు
గోగుపక్కిరీ ఢిల్లినబాబుకు గుఱ్ఱము కొని తెచ్చెన్
బాగుగ నాగుఱ్ఱం బిగిలించిన తూఁగి సేనవిచ్చెన్
పాచ్ఛా వప్పుడు మూర్ఛ తెప్పిరిలి పక్కిరినిజూచి
అచ్ఛాబహాదర్ ఘోడాతుంకోన్ అనఁగ వాఁడు తేచి
సలాంమహారాజ్ పాచ్ఛా యిదిగో సలామయ్యా నీకు
హాలేమాన్ తు ర్పిచ్చెద బహుమతి యానతీయు మాకు
రహీమిూరఁగ బహుమతి పక్కిరికి రాజలింగబాబు
సహజంబుగ నప్పించి వేడ్కతో నరగున పనిచెనబాబు
వాసిమిూరిన గుఱ్ఱము నెక్క ను రాజలింగబాబు
దేశాధీశుల బిల్వబంపుము రాజలింగబాబు
అని యిటు పాచ్ఛా వానతియ్యగా రాజలింగబాబు
పనిచెను హర్కారుల దేశములకు రాజలింగబాబు
అప్పుడు వచ్చిరి పాళెగారు లాహాయమును జూడఁగను
వొప్పుమిూరగా వచ్చియు వా రా మెప్పులగుఱ్ఱమును
తప్పక చూచియు దానిగర్జనకు తగ భయంబు జెంది
చొప్పడ దీగుఱ్ఱము మా కెక్కను యిప్ప డనుచు గుంది

మొగములు వెలవెలబారఁగ నంకఱు మోదంబులు దరిగి
వగలబొగలఁగా రాజలింగబా బగణితముగ నెఱఁగి
పదిలుఁడైన దేసింగుని తండ్రిని పరఁగఁ బిల్వబంప
కదలెను ధరణీసింగునిగూడి కడుముదము జనింప
చేరి ఢిల్లిలో తేజినిజూచి చేరియెక్కలేక
వారిపుడు ఖైదునపడి రైదువత్సరములవఱకు
తెంపుతోడ నైదేండ్లబాలుఁడోయ్ దేసింగ్ మహారాజు
సొంపుమీర తేజీపై నెక్కెను చోద్యముగా రాజు
లందఱు జూడఁగ మటుమాయంబై యైదుదినంబులకు
పొందుగ దవుడాయించియు నలసట పొంది కనల నటకు
తనకులదైవం బగురంగేశుని దలఁచియు రాఁగాను
చనువున స్వామియు ఢిల్లిలో తేజితో చక్కఁగ విడునఁగను
ఉన్నబాలుని చోద్యము మదిలో నెన్నుచు తేజీని
పన్నుగ పాచ్ఛా యినామిచ్చి తా బంపెను రాజీని
ఆగుఱ్ఱముపై నెక్కియు దేసింగంత చెంజిజేరి
భోగంబున దేవేంద్రునితీరై పొంగినాఁడు మీఱి
దుడుకం డాగుఱ్ఱముపై నెక్కిన తోండ్రమల్లన్న
గడగడవడఁకును యీజగమెల్లను కదలవలవదన్న
ఉసురువున్న వుష్పమ్మవచ్చును ప్రాణికిపోనన్న
రసికుఁడయిన యాదేసింగునితో రచ్చలు వలదన్న
ప్రత్యక్షంబుగ రంగనాయకుఁడు పలుకుచుండునన్న
నిత్యము తిరుమణిధారులఁ గన్నను నీతివినయుఁడన్న
తోడనె యామాటలు విని నవ్వెను తోండ్రమల్లోజీ
వేడుక యయ్యెను నీమాటలచే వేంకట్రావోజీ
తిరుమణి నేను ధరియించుకొని దేసింగుని గాంచి

వెరపులేక వానిని యిటదెచ్చెద వేగమొనగించి
పోయివచ్చెదను చెంజికనుచు తా వ్రేయించెను భేరీ
పాయ కతిత్వరితంబుగ చెంజిపట్టణంబు జేరి

—— తోండ్రమల్లోజీ చెంజికోటనుజూచి విస్మృతినొందుట. ——

కోటలు ప్రాకారంబు లగడ్తలు గోపురంబులును
నాటమైన నుహాడీలును మఱియు మేటిపడగలును
రచ్చతిన్నెలు చలువచప్పరాల్ రాజవీధులును
హెచ్చుగ బ్రహ్మక్షత్రవైశ్యలు యెలమిని శూద్రులును
శ్రీవిమీరఁగా వీథులందిరుగు విటీవిటజనములను
భావమురంజిలఁజేసెడి వేశ్యాభామాజనములును
దేవాలయములు దివ్యతీర్థములు తేజరిల్లఁగాను
కోవిదు లచ్చట శాస్త్రాగమముల గోష్ఠిసల్పఁగాను
ఘాటిమీరు నుద్యానవనంబులు తేటతటాకములును
పాటిగ శుకపికకలరవములును పారావతములును
తేజమలర నవరత్నపుకాంతులు దీటుగ వెల్గఁగను
రాజధాని యొప్పుగ విలసిల్లెను రంజితంబుగాను
చటులతరంబగు దుర్గంబును తా నటుగని తలయూఁచి
తటుకున వేంకట్రావు దెల్పిన దాఖల్ మది నెంచి
ఇటువిలసిల్లెడు కోట జూచి తా నెచ్చుగ గొనియాడి
పటుతరముగ నేవిధమున సాధింపఁగల నెవరి గూడి
దండును దేవనూరిదగ్గఱ నుండగాను బంచి
ఖండితముగ దేసింగునితోడను కదసిపల్క వెఱచి
కుయ్యక నాలుగుదినములదాకా నయ్యెడనుండియును
చయ్యన బోవుటకును తా నంతట సందేహించుచును

భేరీవేయించెను మరునాఁడా భేరీశబ్దమును
సారెకు నప్పుడు పాతచెంజికిని చయ్యన వినఁగాను
తడయక దేసింగుని పినతండ్రి ధరణిసింగుఁ డపుడు
గడగడ కాళ్లును చేతులు వణఁకఁగ కడు మోసము నేఁడు
ఎప్పుడు లేనీ భేరీశబ్దము యిప్పుడు నిచ్చటను
తప్పక కలిగిన విధమేమో యని తడబడుచును తాను
సూటిగ మోర్దా పై నెక్కియు తా జూచి యంతలోను
యేటిగట్టున దిగినదండును యేర్పడ గనుఁగొనెను
త్వరితంబుగ తన తనయునియొద్దికి తర్లి వచ్చు వేళ
గురుతరముగ దేసింగుఁడు రంగని కోరిపూజ చాల
చేయుచుండె శ్రీహరినారాయణ శ్రీశపద్మనేత్ర
తోయజనాభ జనార్దన కేశవ కాయజహారమిత్ర
భావజజనకా పరమపురుష హరి పార్థమిత్ర శౌరీ
సేవిత మౌనిజనావన మురహర చేదినాథహారీ
అనుచును తనపాలిటి రంగేశుని మనమలరఁగ నతఁడుం
ఘనముగ ప్రార్థనజేయఁ జూచెను పినతండ్రియు నపుడు
తనయుఁడైన దేసింగునిజూచి తాను బల్కినాఁడు

తోండ్రమల్లోజీ దండెత్తివచ్చిన సమాచారము దేసింగునకు
ధరణిసింగు దెలుపుట.

అనఘా పుత్రక వినుమొకవింత కనులుదెఱచి చూడు
కనుఁగొనప్రళయంబుగ నున్నది యీకరణిజూడ నేఁడు

.... .... .... ....

పనిబూనియు నీపూజ లేమిటికి బాలుఁడ దేసింగు
మనము యేమరి యుండినందునను తనయా దేసింగు
మనకోటకు నిపు డపాయమువచ్చెను తనయా దేసింగు

అనయము రంగని నర్చింపఁగ ఫల మేదయ దేసింగు
దేవసూరిలో భేరీశబ్దము ధింధిమియనుచును
దావాదంబుగ నబాబుదండు దషయక వచ్చియును
ముసుకొని నాలుగుదిక్కులదండు ముట్టడివేసెను
మన మిప్పుడు యేమరియుండుట యిది మర్యాదా యనెను
బహుపూజలు సేయుచు వినె నప్పుడు బాలుఁడు దేసింగు
సహజంబుగ కనుదెఱచిజూచెను చాలగ దేసింగు
రాముురాము రే దేవా మీకు తాం తండ్రిగారు
రాముురాము రే తండ్రీ మీరు యేమిఁజెప్పినారు
ఇందుకు నేను భయపడనయ్యా యిపుడు తండ్రిగారు
సందేహము మీ కేల నిప్పుడు చాలతండ్రిగారు
అనుచును పకపక నవ్వి పలికెను అంతట దేసింగు
ఘనసింహమువలె గర్జనజేయుచు కనుఁగొని దేసింగు
మన్ననతో నామనవి వినవయా పిన్నతండ్రిగారు
పన్నెండేండ్లపైక మిక్కుడను పిన్నతండ్రిగారు
పన్నెండేండ్ల గుండుమందును పిన్నతండ్రిగారు
పన్నెండేండ్లుగ పెరిగినకసువు పిన్నతండ్రిగారు
పెంపుగ రంగేశుని కృపగల్గగ బెదరనేల మీరు
ఇంపుగ రంగేశుని పూజించుచు యిపుడు తండ్రిగారు
రామరామ యను నంతకాలము రాజ్యమేలుదాము
ఈమహీ రాజకులాగ్రణి శూరత నిపుడు హెచ్చినాము
తగున నబాబు దండుతీసుకొని తాను వచ్చినాఁడా
తగవుబెట్టుకొని నన్నెదిరించెడి మగవాఁడైనాఁడా
పొందగ్గువాని పరాక్రమమెల్ల భూమిపాలుగాను
ఒందజేసెదను క్షణములోన మీ రందఱు జూడఁగను

పులినోటనుబడి బ్రతికినవా రీభువిలోనున్నారా
తలగక మదనాగముతో పోకీ తప్పిపోయినారా.
పట్టుగ పట్టి కట్టైన నిప్పుడు దిట్టముగను వాని
మట్టుమీరినను యిట్టటుకదలక కొట్టించెద కాని
కదలనీక వానిని యెదిరించెద ఖండితంబుగాను
ఇదిగో నాబల మెదిరిబలంబును యిక జూడంతయును
కాని నబాబు నెచటికి నిప్పుడు కదలనీయ నయ్యా
పోనీయను యీరాకాటికి నిప్పుడు పొందుగ విన్నయ్యా
సారెకు యుద్ధంబును జేయుటకే సందేహము లేదు
నూరులో చావు నారులో చావు తీరితేను విడదు
ఘడియవకాశముచేయుడు కదలివత్కాద నంతయును
తడయక దేవరపూజకు విఘ్నము తగదు చేయఁగాను
అని దేసింగుఁడు రంగనాథుని కర్చనజేసియును
ఘనముగ ధూపదీపాదులకు కడువడి నొసఁగియును
సరసంబుగ నైవేద్యము లొసఁగియు హారతు లిచ్చియును
పరమభక్తి నుపచారము లన్నియు పరఁగఁగఁ జేసియును
పట్టుసరిగె బల్ జామానీమా బాగుగధరియించి
దిట్టముగా జల్తరుపేటందు ధట్టిగట్టి లేచి
సరిగెబుట్టా ల్పాగా బాగా శిరమునందుబెట్టి
కరముల నవరత్నంబులుజెక్కిన కంకణములుబెట్టి
వెలలేనిరవలంటుజోళ్లును వేడ్క చెవుల మెఱయ
చెలువుమీరఁగా రత్నహారముల్ సరసకాంతి నొరయ
పచ్చలకల్కితురాయి దాల్చె దా నచ్చుగ శోభిల్ల
ముచ్చటవేళ్లకు నుంగరములుబల్ హెచ్చుగవిలసిల్ల
శృంగారించుక దేసింగుఁడు బల్సింగమువలె నపుడు

మంగళకరమగు బాకీకత్తిని మరియుదాల్చినాఁడు

—హర్కార్ల ద్వారా దేసింగు తోంద్రమల్లుని పిలిపించుట.—

తనకొలువులోనుండెడి హర్కార్లను తప్పక జూచియును
కనులెఱ్ఱగ జేయుచు కోపంబున కదసిబల్కె నటను
ఏమోయ్ హరకార్లారా మీరు యిప్పుడు వినరోయి
నామీఁదికి దండెత్తివచ్చిన యాతఁ డెవ్వఁడోయి
పోయి శీఘ్రముగ వానిసంగతులు పొసఁగ దెలిసిబాగ
నాయొడకును దోడ్కొని తెం డన్నను నంత వారు వేగ

—హరకారులు తోంద్రమల్లోజిని బిలుచుట.—

చని ధీరతతో తోంద్రమల్లును చయ్యన నటుజూచి
ఘనుఁడగు దేసింగుఁడు మిము చెంజికి గ్రక్కున రాఁబనిచి
వచ్చినార మిఁక రెండు రెం డని వారు బల్కువేళ
అచ్చట నిలబడి గడగడవణఁకుచు నదరుచు నట చాల
పలుకకయుండిన తోంద్రమల్లును పరుషంబున జూచి
నిలువఁగూడ దిక చలో భాయి యన నేర్పుతోడ లేచి

—తోంద్రమల్లోజి దేసింగురాజుకడకు వచ్చుట.—

ప్రాని యెంగిలి యుమిసి సున్నమున పొసఁగ నామమేసి
యేనుఁగనెత్తుడు నడిమినామముగ మానితముగ వేసి
భయముతో చెంజికి పోయెను తోంద్రమల్లోజటువేగ
ప్రియముతోడ రంగేశుని మనమున పెంపు దలఁచి బాగ
తొందరతో యేనుఁగుపై నెక్కెను తోంద్రమల్లోజీ
కందుచు మనమున జాలిజెందుచును కడువడి మల్లోజీ
వెడలెను దేసింగునికొలువునకు విహితరీతిగాను
తడయక నచ్చట దేసింగుఁడును తటుకున ప్రియమునను

—దేసింగు తనకొలువునందువారలఁ బిలిపించుట.—

పొందుగ గొందఱ హర్కారులను పరువడి రప్పించి
అందుమీఁదటను వారినిఁజూచి యరసి మీరు మించి
జయరాం గంగేరాముని తెండిక జల్దిగ కొల్వుకును
పయముగ పిల్వఁడు గోపాల్ సింగును రత్నసింగులాను
రాముసింగు లక్ష్మణసింగులను రమ్మను కొల్వుకును
ప్రేమమీరఁగా హీరాదాసును పిలుచుకరం డీఁకను
ధరణిసింగును మానీసింగును కరుణసింగులాను
త్వరలో లక్ష్మణదాసుహుసేనుని తడవుసేయకాను
పేటసిపాయి మహామత్తానుని పిన్నయ్యను వేగ
ఆటంకముసేయక తెప్పించుడి అరనిమిషములోఁగ
అన్నంతట హరకారులు నేఁగియు నందఱి బిల్వఁగను
విన్నంతట వారందఱువచ్చిరి వేడ్క కొలువునకును
కొలువవచ్చిన జమేదార్లను కోటను బేదార్లు
చెలువంబగు దేసింగురాజునకు చెంతజేరి వార్లు
రాంరాంరాంరాంరాంరాంరాంరాం రాజా దేసింగు
మేం రాగలయీకార్యము నెరవుము మేలగు దేసింగు
సామజవరదుం డగు శ్రీరంగస్వామియు దేసింగు
ప్రేమతో నీతోఁ పలుకు నందురు పెంపుగ దేసింగు
అనఁగా వారలకెల్లను రాంరాం అనియెను దేసింగు
తనమది గనలుచు నట్టుచూచెను తనరఁగ దేసింగు
దుడుకున నేనుఁగ నప్పుడు దిగియెను తోండ్రమల్లయ్య
గడగడవడఁకుచు రంగేశా నను కలసి బ్రోవవయ్య
కమలనాభ శ్రీహరి నారాయణ కంజనేత్ర శౌరి
అమరవందితా అనాథరక్షక యనుచు మదిని కోరి

ఉన్నవాఁడను నన్నుబ్రోవుమో పన్నగేంద్రశయన
కన్నతల్లి తండ్రివి నీవే నాకెన్నగ నెప్పుడన

దేసింగు తోంద్రమల్లోజిపై కోపముచేయుట.

పొంగుచు తోంద్రమల్లోజిని దేసింగురాజు చూచి
రంగుమీర మాకోటమీఁదికి రానేల మదించి
ఎన్నడు నీవీ దారియెఱుఁగ వివు డేలవచ్చినావు
నిన్నెవ్వఁడు పంపించినవాఁడు నేరక నెవ్వఁడవు
నబాబుదండిటు రానేమిటికి నాదు కోటపైకి
సబబుజెప్పుము నీకు జంపుదునే సబబుజెప్పుకున్న
ఇదిగాకను రణభేరివ్రేయఁగా నేమికారణంబు
పదరక దెల్పుము బ్రతుకవలసినను పరఁగ నీనిజంబు
పరువెఱుంగకను పలువతనంబున బవిశిమాలి నీవు
తరమెఱుంగకను చెడుతలంపుగొని తప్పుచేసినావు
అరనిమిషంబున నీతల దునుముదు నంచితంబుగాను
సరగున నిన్నట పంపినవానికి బలము గ్రుంగఁగాను
అని దేసింగుఁడు ఘనకోపంబున కనుల నిప్పులొలుక
కనుఁగొనియును నా తోంద్రమల్లుని కదసి యంత నలుక
గర్జనతో కత్తియు ఝుళిపించిన గడగడవడఁకుచును
మర్జ తెలిసియు రంగేశుని తా మరిమరి పొగడుచును
ఈకరణిని నాపై కోపము నీవిట్లుసేయ మున్ను
సాకినవారలు చెప్పినపనులను జరుపక నెట్లగును
రామరామ నా మనవివినవయా రాజా దేసింగు
నామీఁదను కోపంబుసేయకను ప్రేమదయ నొసంగు
కొంచెము నామాటలను వినుము నీ వెంచగ నిప్పుడును

మించి నబాబుకు నూటయెనిమిది మేటిపాళెములును
కిస్తిరూకలు కొదవలేక ప్రశస్తత నందఱును
సుస్తిచేసి యీ చెంజికోటలో దస్తునిలుపగాను
మెండుగబాకీ రూకలు యిరువదిరెండేండ్లవి కలవు
దండిగపాత చెంజికిపోయీ తడయ కిపుడు నీవు
బాకితెమ్మని సాదుల్లాఖానుఁడు పంపినాఁడు నన్ను
తేకువచెడి నీమరుగుజొచ్చితిని దేసింగుఁడ నేను
సింగమువలె కనుబొమలుకదలఁగా చీదరగొట్టుచును
బంగరువారపై చెక్కినరత్నా ల్బరువడి మెఱయఁగను
తెగువమీఱిన కత్తిసిదూసిన దేసింగుని చూచి
తగవుమాని యా తోండ్రమల్లుఁడు తప్ప కపుడు లేచి
శరణు శరణు ననుకాపాడుట కిది తరుణము మహారాజా
గురునటంచు నీ మరుగుజేరితిని ధరణిసింగురాజా
అనుచును ధరణీసింగునిమరుగున కరుగఁగాను జూచి
పినతండ్రిని శరణంబువేఁడెనని పెనుకోపము నడఁచి
దుర్బుద్ధిని నిటు బల్కఁగదగునా తోండ్రమల్లన్న
నిర్భయంబుగా యెదుటను నీవు నిట్టులాడుచున్న
తోడరిచంపక గాపాడుదునా తోండ్రమల్లన్న
తోడిబడ మాపినతండ్రిమరుగు జన తోండ్రమల్లన్న
చావక బ్రతికితి వీసమయంబున చక్కఁగ వినుమన్న

దేసింగు సాదుల్లానునికి జాబువ్రాయుట.

నీవలె సాదుల్లాఖానుఁడు వచ్చిన నేఁడు చచ్చునన్న
సావకాశము వలదు నబాబును చక్కరమ్మనన్న

.... .... .... .... ....

ధైర్యముగలిగిన మానవుఁడైతే తర్లిటు రమ్మనుము
శౌర్యముగలిగిన సిపాయియయితే జల్దిగ రమ్మనుము
మీసముగలిగిన మగవాఁడైతే వాసిమీర మనుము
దేసింగునికత్తిమొన రూకలు తీసుక పొమ్మనుము
కినిసిన చేపల నమ్మెడిలబ్బకు కిస్తికట్టవలెనో
మొనసు బేదార్లేకడనైనా ముల్లెలంపగనెనో
ఈసారియు పోయినసారికె యెలమి పండినాది
తీసుకపోవచ్చును యీకసువు వాసిగనున్నాది
కోటకు వెలపటి గుండురాళ్లను గొంచుకబొమ్మనుము
ఏటియిసుక వున్నది వొంటెలపై నెత్తుకపొమ్మనుము
వరదవచ్చి నప్పుడు యీయేటిలో బురదనిలిచె మెండు
వరుపున కవి దగ నెండిచెక్కలై పడియున్నవి తెండు
వరుసగ యెడ్లను గోనెల మోపుల నొప్పుగగొని తెండు
పెరికెలు నిండించుకపోవచ్చును పరువడినే తెండు
అనిపలికియు కలకలమని నవ్వుచు అప్పుడు దేసింగు
పనివడి జాబటు వ్రాసియిచ్చెను పటుగతి దేసింగు
దుడుకున వ్రాసిన జాబుతీసుకొని తోండ్రమల్లుఁడును
గడగడవడఁకుచు మూర్ఛజెంది యక్కడను శవమువలెను
పడి మూర్ఛిల్లియు తెప్పిరిల్లుకొని బహుళభీతితోను
విడిచి యిచటనే నెప్పుడు నేగుదు పుడమీశుని కడను
కనలుచున్న దేసింగుని మోమును కనుఁగొని యంతటను
మనమలరఁగ శ్రీ రంగేశాచ్యుత మాధవ యిప్పుడును
రక్షించిననే బోయెద గదలి రంగనాథస్వామీ
లక్షవిప్రులకు నన్నము బెట్టెద రంగనాథస్వామీ
రంగుమీర గోదానము లిచ్చెద రంగనాథస్వామి

అంగముతో నార్కాడు జేర్చుము రంగనాథస్వామి
శృంగారంబగు వస్త్రము లిచ్చెద రంగనాథస్వామి
మంగళకరమగు భూషణ మిచ్చెద రంగనాథస్వామి
త్రాణలుడిగె నిర్జీవమాయెను రంగనాథస్వామి
ప్రాణములను కాపాడు మిప్పుడు రంగనాథస్వామి
ఇటు ధ్యానించిన తోండ్రమల్లును గని సంతట పేర్మి
పటుగతి పకపకనగి దేసింగుఁడు పల్కె నపుడు కూర్మి
మకరాంకుని జనకుని దలఁచఁగ నిను మనిచె తెలియు మనెను
యిఁక నొకమాట నేను చెప్పెదను యింపుమీరఁగాను
నీవు వచ్చినటు నబాబువచ్చిన నే పోనివ్వనురా
కావున వానికి నేభయపడరా కానీ రమ్మనురా
నీతిరుమణికి భయపడితినిరా నిన్ను నేను యిపుడు
మొత్తికాలు పట్టీడ్చి వేతురా నెత్తిపగల నేడు
జోకతొ రంగస్వామిని దలఁచఁగ సాక్కె నిలిచినారా
లేకుంటే నీప్రాణము తీతును ప్రాకటముగ పోరా
అమ్మాటలు విని తోండ్రమల్లుని కప్పుడడఁగె పొంగు
రాంరాం రాంరాం రాంరాం రాంరాం రాజా దేసింగు
రయమున నాపై కోపగించకు రాజా దేసింగు
భయమునుజెంది యున్నానయ్యా బలియుఁడ దేసింగు
పోయెదనయ్యా కోటవిడిచి యింపొందగాను వేగ

—తోండ్రమల్లుఁడు చెంజీనుంచి యార్కాడుకుపోవుట.—

ఆయెడనున్న జమేదార్లతొ నంతజూచి బాగ
ఏనుఁగపైని గుఱ్ఱముపైని యెక్కలేను నుమ్మి
మానక నార్కాటికిపోవుటకై పాలకీని తెమ్మి

వరుసగ మూఁడుదినాలపైనమై నస్తిమి చెంజికిని
దురుసుగాను యీరాత్రికి నార్కాడురవడీ గనమేని
ఒప్పదు నామది త్రిప్పులబడియెడి నోరలజొచ్చె మేను
ఇప్పుడె ప్రాణము వెడలునటంచని యెన్నవలసె నేను
పన్నుగ నాతం డంతట వడిగా పరువిడదొడఁగఁగను
క్రన్నన సాయంకాలంబునకును కదలిన సేనలును
వన్నెమీర నార్కాడుచేరెను వరుసగ నంతటను
సన్నుతనుగు నార్కాడుచేరఁగా జరచిరి భేరియును
ఆభేరీశబ్దము విని నంతట నబాబుసాదుల్లా
తా బంగారు నాయని జూచియు తనమది విలసిల్ల
వరువడి చెంజీ రూకలు వచ్చెను బంగార్నాయఁడా
పరిపించుము చదురపుజముకానా బంగార్నాయఁడా
పరగ సరాబును బిల్వబంపుము బంగార్నాయఁడా
పరికింపఁగ దీపా ల్వెట్టింపుము బంగార్నాయఁడా
అనఁగా బంగార్నాయఁడు కడువడి నట్టె యొనర్పఁగను
తనమిత్రులతో గూడుక ప్రియమును తగువేషముతోను
చదురుతీరి కూర్చుండె నబాబు సాదుల్లాఖానుఁడు

—తోంద్రమల్లోజి నబాబువద్దికి వచ్చుట.—

కదసి తోంద్రమల్లోజి వచ్చి యటు నెదుర నిలచినాఁడు
తోడనె సలాము జేసె నబాబుకు తోంద్రమల్లన్న
వేడుక బదులూ సలాము జేసెను వెలయ నబాబన్న
పులవలుదంచిన రోకలివలెనే యూరక నిలుచున్న
తలఁచినకార్యం బేమాయెను యిఁక తప్పక బలుకన్న
చెంజిరూకలు యేమి జేసితివి చెలువుమీర నిపుడు

పంజరైన దేసింగుం డేమని పలికినాఁడు నేఁడు
చెప్పుము వేగమె తోండ్రమల్లనా చెలువుమీఱ నేఁడు
తప్పక మీఁదటి కార్యము నేను తలఁచెద నీకఁజూడు
రూకలు లేదు కాసులు లేదు రూఢిగాను నచట
తేకువతో దేసింగుని సరియౌ ధీరులు లే రచట
నాటయెనిమిదిపాలెగాండ్రను నేటుగఁజూచితిని
పోటకియగు దేసింగుచే భంగపాటటు గంటిని
భళిభళి యేమని చెప్పుదు చచ్చి బ్రతికివచ్చినాను
తులువరైన దేసింగుని చేతను తొందరబడినాను

-తోండ్ర మల్లయ్య నవాబుకు జాబుయిచ్చుట-

జాబువ్రాసె నీపేర నిదేమో నబాబు సాదుల్లా
బాబువారిగా జూడఁగఁ దెలుసును నబాబు సాదుల్లా
దుడుకున నిట్లని జాబుయిచ్చెను తోండ్రమల్లోజీ
బడేకర్ణము రంగపిళ్లను తడయక పిలిచి ఖాజీ
వ్రాసియిచ్చిన జాబు జూడవోయ్ రంగనాథపిళ్ల
వాసిగ జాబును చదివి చెప్పుము వరుస నర్థ మెల్ల
అన విని కడువడి రంగపిళ్ల తా నపుడు జాబుజూచి
కనలుచు తోడనె తలవంచుకొని తనదు మేను మఱచి
ఇటువలెనుండిన రంగపిళ్లను యెలమితోడ గాంచి
తటుకున దెల్పుము జాబుసంగతిని దాచవలదు మించి
రెండుగడియలకు లోపల చెంజిని పిండిగ జేయింతు
దండియైన దేసింగుని పట్టి తల తెగ నఱికింతు
అంతఃపుర కాంతల నేఁబట్టి యట చెఱ వేయింతు
పంతంబున నా పోటరులను నే బద్ధులగావింతు

జాబునసుండే వర్తమానముల సవిస్తరంబుగను
బాబురే తెల్పుము రంగపిళ్లయిఁక పటుతరంబుగాను

రంగపిళ్ల జాబునసుండు సంగతులు వివరించుట.

అనిన నబాబుతో రంగపిళ్ల తా నప్పు డిట్టులనియెన్
విను మిక జాబునగలవృత్తాంతము విశదంబుగ ననియెన్
నీవు వచ్చినటు నబాబువచ్చిన నింక బ్రతుకఁడన్న
సావకాశ మిఁక వలదు నబాబును చక్కరమ్మనన్న
ధైర్యము గల్గిన మగవాఁడైతే తర్లి వేగ రమ్ము
శౌర్యముగల్గిన సిపాయివైతే జల్దిగ నిటు రమ్ము
మీసముగలిగిన రోసరివైతే వాసి మీర మనుము
దేసింగుని కత్తిమొనరూకలు తీసుక దగ బొమ్ము
కినిసిన చేపల నమ్మెడిలబ్బికు కిస్తికట్టవలెనో
మొనసు బేదా ర్లెక్కడనైనా మల్లెలంపినునునో
ఈసారియు పోయిన సా రారికె లెలమిని పండినది
తీసుకపోవచ్చును యూకసువు వాసిగనున్నయది
కోటకు వెలపట రాళ్లగుండ్లను కొని వేగమె పొమ్ము
పటియిసుకవున్నది వాం టెలపై నెత్తించుకపొమ్ము
పెరికెలు నిండించుక పోవచ్చును సరగున వచ్చినను
స్థిరముగ నున్నది యీపదార్థములు చింతలేల కొనను
ధీరతలేని యూఁడదివైతే ఢిల్లికిబోపొమ్ము
వారక యీభావము నాజాబున వ్రాసినాను రమ్ము
అచ్చుగ నామాటలు వినినాఁడా నబాబుసాదుల్లా
హెచ్చినకోపముతోడ మండుచును నచ్చుటివారెల్ల
వినఁగా బంగార్నాయనిఁజూచి కనుబొమ లదరఁగను
కనులనెఱ్ఱగను కావి గప్పఁగను కడువడి పదరుచును

తనమది కోపము తారసిల్లఁగా తా నపు డిట్లనెను
వినవోయ్ బంగార్నాయఁడ యిప్పుడు వేగిరంబుగాను
అనికివలయు పను లెల్ల నిప్పు డాయ త్తముతోడఁతెను

.... .... .... ....

పరగ గుఱ్ఱముల రౌతుల దెమ్మను బంగార్నాయఁడా
బరువడి ఢంకా వేయిగ బంపుము బంగార్నాయఁడా
రంగుగజండా యెత్తు మిప్పుడే బంగార్నాయఁడా
పొంగణంచెదను దేసింగుని నే బంగార్నాయఁడా
అని యిటు బల్కుచు నబా బప్పుడు అతివేగముతోను
ఘనమగు కోపము కడఁవి స్తరమై కారుగ్రమ్మఁగాను
అంతట కత్తిని దూసిపట్టె దగ నబాబు సాదుల్లా
పంతముతో మీసం బొడవేసెను భయపడ ప్రజలెల్ల
పటపటపటయని పండ్లుకొరికెను బరువడి జనులదర
చటులకోపమున కన్నులనిప్పులు చటచట మని చెదర
ఆసమయంబున బంగార్నాయుం డతనిచెంత జేరి
వాసిమీర నే యేయేపాళా ల్వారిబిలతు మీరి
నూటయెనిమిదిపాళేగార్లను నేటికొల్వునకును

బంగార్నాయఁడు పాళేగార్లకు జాబువ్రాయుట.

పాటముగా బిల్పించు వేగమే ధాటిమీరగాను
అనవిని బంగార్నాయఁ డప్పు డా హర్కారెల్లఅను
పనిచెను బొబ్బని నూటయెనిమిది పాళయమ్ములకును
నిమిషములో హర్కారులు పోయి నెఱిఁగించఁగ వేగ
క్రమమున జాగీర్దారు లప్పుడు కదలిరాగ బాగ
తప్పక మందును గుండు దండును తయారుతోడుతెను

తెప్పునవచ్చిరి యెల్లపాళెగా ర్లప్పుడు కొల్వుకును
చేతిపట్టుయేల్ గంగేరామటు చేరెను కొల్వుకును
యాతిరుణామల సుబంగిదొరతా నప్పుడు కొల్వుకును
తిమిరికోటయేల్ శేఖుమహమ్మదు క్రమముగ కొల్వుకును
నమరినవాల్కోటబ్దుల్కాదర్ నడిచెను కొల్వుకును
ఆరణివెంకటాద్రియుం డప్పుడు వచ్చెను కొల్వుకును
వార కరియులూ ర్పెద్దధొరయును వచ్చెను కొల్వుకును
చెంగల్పట్టు సుబేదారుఁడు చేరెను కొల్వుకును
మంగళపేట జమీన్దారుఁడు మరియువచ్చె నపుడు
అచ్చినాయఁడు బొమ్మినాయఁడు వచ్చిరి కొల్వుకును
ఎచ్చుగ నగరా ర్పాళెగాడును వచ్చెను కొల్వుకును
మరియునుగల యాంపాళేగారులు మచ్చిక మీరఁగను
తరియొజెంగి తా నప్పుడె యార్కాట్పంగ జేరఁగాను
పెంపుగ ధణధణ ధణధణ యనుచును భేరీమ్రోయఁగాను
సొంపుగ నబాబు విని నాశబ్దము నింపుమీరఁగాను
వచ్చినవారిని గనుఁగొని యప్పుడు వరుసగ కొలువెల్ల
నచ్చికంబున లేవగ ముఖమున నబాబు సాదుల్లా

నబాబు బంగార్నాయని సేనలనున్ను రస్తులనున్ను తయారుచేయుమనుట.

ముచ్చటమీరఁగ బంగార్నాయని ముందుగ రప్పించి
ఎచ్చుగ మందును గుండును మూడా నెలలకు నిప్పించి
తడయక రస్తు జమీన్దార్లకును తయారుజేయించి
వడిగల యార్మ్నార్ పిరంగీలను వరుసగ నెత్తించి
ఎనబై వేల బారుతుపాకుల యిప్పుడు తెప్పించి
ఘనముగ సందుకు మందూ గుండూ గ్రక్కున నిప్పించి

సరగున యేనూ ర్జమీన్దార్లకును సంగతి దెల్పించి
బరువడిరస్తు సుబేదార్లకును భర్తీజేయించి
ఠీవిగపచ్చని తెల్లనివన్నియ డేరా లెత్తించి
లావుగ నెనబై వేల సిఫాయిల నీవిటు రప్పించి
లెక్కలేని కాల్బలములనెల్లను చక్కఁగ బిల్పించి
మక్కువ యిరువై వేలేనుంగుల నిక్కడ జేర్పించి
లక్షగుఱ్ఱముల పదివేలొంటెల లక్షణంబుగాను
ఏక్షణంబునను హాజ్జరేయుము యింక వేగమునను

బంగార్నాయఁడు దండును తయారుజేసితినని నబాబుకుచెప్పుట.

ఆమాటలు విని బంగార్నాయఁడు అడ్డిసేయకను
సీమామూలపు బలములనెల్లను జేర్చి శీఘ్రముగను
బంగార్నాయఁడు సలాముజేసి నబాబు కిట్టు లనెను
సంగతు లన్నియు సెలవుచొప్పునను జాగ్రతయిన దనెను
ఇంతమాటలు సాదుల్ఖానుం డింపుమీర విని తా
అంతలోన జల్దిజల్దనుచును అంతిపురము జని తా
జామానీమా దొడ్డిగినాఁడయా సాదుల్ఖానుండు
సాముగపట్టు ధట్టిగట్టెను సాదుల్ఖానుండు
జరీబుటేదార్పాగాజుట్టెను సాదుల్ఖానుండు
జరీబనారసు పచ్చడమందెను సాదుల్ఖానుండు
సరవిగ కల్కితురాయి దాల్చెను సాదుల్ఖానుండు
సౌరుగ పట్టాకత్తిని బట్టెను సాదుల్ఖానుండు
అప్పుడు పట్టపుటేనుఁగు దెమ్మనె నబాబు సాదుల్లా
తెప్పున తెచ్చెను మాష్టివాఁడును తేజముల్లసిల్ల
శృంగారంబగు యేనుఁగ నంతట జూచి సంభ్రమునను

## బంగా రంబారీపై యెక్కేను రంగుచెలంగఁగను

### నబాబు సకలసేనాసమేతంబుగా చెంజికి యుద్ధమునకుఁబోవుట.

వాళెగార్లను గూడి చెంజికిని పైనంబావేళ
చాలఁగ భేరీ వ్రేయించుటకై సాటె రిపులదూల
భీకరంబుగను ధణధణధణమని భేరీమ్రోయఁగను
ప్రాకటంబుగను ధగధగమెఱసెను పట్టాకత్తులును
కణకణకణ కణకణమని తంబుర గ్రక్కున మ్రోగఁగను
పనివడి దడబడ మని గుఱ్ఱములు బారుతీరగాను
సరగున ఝల్లరి తాచాతమ్మట సన్నవాద్యములును
దుసుసుగ బూరుగ కాహాళములును తోడనె చెల్గఁగను
అరుదుగ నబాబు దండునిలిచె పదియామడ పరువునను
గరిమెతో నబాబు యేనుఁగు నెక్కె గ్రక్కున రాఁగాను
ముందుకటికము ల్పరాకనుచును మొనసిపొగడి నిండ
అందును వింజామరలు కుంచెలు సంది వీచు చుండ
పట్టుగొడుగులు సరిగెలు పడిగెలు దిట్టముగా రాఁగ
చుట్టును బేదార్లంపఱుయెంతో మట్టుమీరి బాగ
రాజితముగా గింజవేసినను రాలదు దండునను
భూజనులందఱు జేజేయనుచును పొగడఁగ నడువఁగను
పెంపుగ తిమిరికోటదగ్గఱను భేరీవ్రేయించి
తెంపునవచ్చి డేరావేసి దిగినదండు జూచి
నయముతో బంగార్నాయని జూచి నబాబు సాదుల్లా
ప్రియముతో దండుకు రస్తుకట్టుము పేర్మివారికెల్ల
అనిన నప్పుడె బంగార్నాయుం డందఱికిని వేగా
పనిబూనియు నడిపించెనురస్తు బాహాటము గాఁగా

అంతట కడువడి బయలుదేరె దం డారణిమార్గముగా
కొంతదూరమున కేగియు డేరా కొట్టిరి యటు వేగా
ఆరాతిరి యచ్చటనుండెను దం డంతట మరునాఁడు
భేరీ వ్రేయుచు దేవనూరిదరి జేరివిడిసినాఁడు

{ నబాబు బంగార్నాయనికి దేవనూరి యేటిగట్టున దండును నిలుపవలసినక్రమము చెప్పుట. }

ఏటిగట్టునను డేరావేసి అంతదండు దించి
పాటిగ సాదుల్లాఖానుం డప్పుడు బంగార్నాయని జూచి
సరగదండునకు సంభారంబులు బంగార్నాయఁడా
మరిదురస్తు జేయించు మిప్పుడు బంగార్నాయఁడా
పటాళముల నచటచట నిలుపుము బంగార్నాయఁడా
పటాణిరౌతుల నొకచో నిలుపుము బంగార్నాయఁడా
రంగుగ గుజ్రా డేరాచుట్టను బంగార్నాయఁడా
సంగతి దెలసియు నిల్పు భద్రముగ బంగార్నాయఁడా
పాగాచౌకీ లేరుపఱచుమిఁక బంగార్నాయఁడా
భారీజండా లెత్తించుము మరి బంగార్నాయఁడా
సూటిగ బారూ తుపాకికత్తులు మేటిరౌతులాను
వాటముగా నందందు నిల్పుము తేటమీఱఁగాను
హెచ్చైన ఫిరంగుల మోర్చా లెత్తించుము యిపుడు
మెచ్చువచ్చున తెల్లబలంబుల మెఱయఁజేయు మనుఁడు
బంగార్నాయఁడు పటుజాగ్రతతో పాళెపట్టులెల్ల
రంగుగనొకచో మొనలుదీరియు రయముగ శోభిల్ల
ముచ్చటతోడను మొనగాండ్రందఱు ముందరగా నిపుడు
అచ్చట కడుజాగ్రతతో మీరు యెచ్చరికలు గనుఁడు

అనుచును బంగార్నాయఁడు మొసలను ఆరసి నేర్పునను
కనుఁగొను పగరకు కడువెర పొదవగ కావించెను త్వరను
ఇటుల నబాబు పాళెంబులను యేరుపఱచి యంత
తటుకున భేరీ వ్రేయించెను దండణమని యాచెంత
భేరీశబ్దము పాతచెంజికిని సారెకు వినఁగాను
కారుబారుగని ధరణీసింగుఁడు గడగడ వణఁకుచును
వింత లిదేమో కలిగెనటంచును వేగమె బురుజెక్కి
అంత నబాబు దండునుజూచి చింతచేత సొక్కి

—ధరణిసింగు దేసింగునకు దండొచ్చియున్న సంగతి చెప్పుట.—

తడబడుచును దేసింగునివద్దికి కడువడి బడిరాఁగా
కడువేడుక దేసింగుఁడు రంగని యడుగుల పూజకునేగా
ధరణీసింగుఁడు రంగనాథుఁడు తనరు నాలయమునకు
పరువడి నేఁగి తదేకనిష్ఠుఁడయి భక్తియొప్పుటకు
పాయక నారాయణ హరి కేశవ పద్మపత్రనయన
తోయజనాభ జనార్ద నాచ్యుత దుష్టగర్వహరణ
మాధవ దైత్యవధూగళసూత్రసుబాధితశస్త్రకరా
శ్రీధరణీధర శార్ఙ్గధనుర్ధర సేవకసౌఖ్యకరా

అని రంగేశుని పూజయొనర్చుచు వినుతులు సేయుటకు
మనమున గుత్సించుచు దేసింగుని ఘనతను మెచ్చుటకు
ఒప్పక నిట్లనె ధరణీసింగుఁడు యిప్పుడు సుకుమారా
చెప్పర మొదవెను దేవర పూజలు తీర్పఁగ సరియేరా
ఈపూజలచే ఫలమే యిప్పుడు యెన్నఁగ సుకుమారా
ఏపున పొదలుచు శత్రుసైన్యములు యెదిరించె కుమారా
చేరె నబాబు దండును దేవనూరిపేటవద్ద

ఊరకె కన్నులు మూసుక పూజలు సలుపువారు కద్ర
చాలుచాలు బాగాయెను పూజలు బాలుఁడు దేసింగు
ఏల యింక యీదేవుని పూజలు చాలుర దేసింగు
పిట్ట పిడుగు బత్తట్టుల దండిదె చుట్టెర దేసింగు
కట్టి పెట్టుమీ దేవరపూజలు ఘనమతి దేసింగు
తలక్రిందికి గుండాయె నబాబు తనయా దేసింగు
ఎలమితోడ మన మేమరియుండుట వలవదు దేసింగు
అనియిటు బల్కిన తనపినతండ్రి వచనములు తా వినెను
కనులువిచ్చి యా ధరణీసింగును గనుఁగొని యిట్లనెను
పెంపుదూలి భీతిల్లఁగనేటికి పిన్నయ మీకిపుడు
ఇంపుగ దేవరపూజకు విఘ్నం బీవు సేయ కిపుడు
ఈయెడ నొకక్షణ మిచ్చుట పూజ సేయవలయు నేను
పాయక దండును భేదించెదను పదరక పొమ్మనెను
పిఱికితురకలను జూచి మీర లిటు బెదరు జెందవలెన
నఱికెదనిపు డా తురకలనంచట నాకు జెప్పవలెన
సంగతిదెలియక యిటుల బెదరుటలు సాహసమునుగాదు
కొంగలగుంపును జూచి బెదరునా కొదమసింగ మనుదు
చింతనొందఁగా దగ దిప్పుడు మీ రెంతయు ధైర్యమును
సంతోషంబును జెందుడీయనఁగ సంతసములరఁగను
సంగతిదెలిసి యూరకుండెను సరగ ధరణిసింగు
మంగళకరమగు నని పూజించెను రంగని దేసింగు

—సుబంగిదార నబాబును దేవనూరిపేటను కొల్లయివ్వమనుట.—

నబాబుదండులో తిరుణామలయేల్ సుబంగిదొరగారు
నబాబుతోడను యిట్లని పలికెను సుబంగిదొరగారు

ఇచ్చుటిదందుకు కొల్ల దేవనూ రిప్పించఁగవలెను
ఎచ్చుగ సేనకు సంతోషంబును నేరుపజుచవలెను
అన్నను సాదుల్లాఖానుం డుత్తర మప్పుడివ్వఁగాను
మిన్నుబెదరఁగా భేరీవ్రేయుచు మేటివీరులాను
సొంపుగ సుబంగిదొరనటుగూడి తెంపుతోడ లేచి
గుంపులఁగూడి దేవనూరిలో కొల్లపెట్టఁదలఁచి
కొంతసొమ్ములు కొంతవస్త్రములు కొల్లబెట్టి రపుడు
కొంతగొక్కములు కొంతరత్నముల్ కొల్లబెట్టి రపుడు
కొంత ధనములును కొంతధాన్యము లొక్కోళ్ల బెట్టి రపుడు
కొంతపశువులు కొంత పేయలును కొల్లబెట్టి రపుడు
చొరఁబడి స్త్రీలను చెరలుబట్టెను సుంబగిదొర యపుడు
చొరవెతిఁగియు మరి వీరుల దరిమెను సుబంగిదొర యపుడు
సరగున పురిలో కాపులందఱును పరువులెత్తి రంత
పరువడిగా దేసింగుని గనుఁగొని మొరబెట్టిరి కొంత

—కాపులు దేసింగునిగాంచి మొరబెట్టుట.—

రాంరాం రాంరాం రాంరాం రాంరాం రాజా దేసింగు
రాంరాంమనవిని వినగదవయ్యా రాజా దేసింగు
దేవా వినుమదె నబాబుదండు దేవనూరిలోన
యావత్తునుదగ కొల్లబెట్టిరి అరయకునికి దగున
కొంకక ధనరాసులును రత్నముల్ కొల్లబెట్టినారు
శంకలేక భూషణావస్త్రాదుల సంగ్రహించినారు
పట్టిరి స్త్రీలను పురుషులనెల్లర పెట్టిరి చెఱలోను
ఇట్టటు కదలక కొంపఱపట్టుక కట్టి వేయఁగాను
ఏమని జెప్పుదు మయ్యా మేము యిప్పుడు దేసింగు

నేమము పూజలు సల్పను సమయం బిపుడా దేసింగు
కన్నులుమూసుక పూజలుజేయను కాలము కాదయ్యా
ఎన్నఁగ పూజలు రాజ్యముకలిగితె యెన్నో కలవయ్యా
ఇంతబ్రతుకు బ్రతి కిపుడవమానం బెంతపడితి నయ్యా
ఇంతవచ్చుటలు తెలియకపోయెను యేమి సేతు మయ్యా
అన్నను కన్నులు దెఱచి కాపులను మన్ననతో జూచి

దేసింగు కాపుల నాదరించుట.

తిన్నఁగ బల్కెను వారలతోడను దేసింగుఁడు మించి
కాపులార మీరలు యీచెంజిలో కదలకుండు డోలి
ఏపుమీర రంగనికిపూజనే నిపుడు జేసి కదలి
వచ్చియుండెడి నబాబుదండును నెచ్చటపోనియను
విచ్చలవిడినే వారల ద్రుంచెద హెచ్చుశౌర్యమునను
ఒక్క దేవనూ రొక్కల్లో బెట్టినా రిక్కడ తురకలును
చక్కఁగ నబాబు రాజ్యమునొల్ల నరగున మీకొను
ఇప్పించెదమీ కేలభయపడఁగ నిపుడు కాపులార
ఒప్పించెదమీ సొమ్ములునేను పొందుకాపులార
అనియిటు కాపుల సమ్మతిపఱచి యంతపూజ సేయ

దేసింగునద్దికి ధనసింగు వచ్చుట.

ఘనుఁడగు దేసింగుని దాయాదగు ధనసింగుఁడు డాయ
వచ్చిజూచి దేసింగునితోడను వదలక నిట్లనియె
ఎచ్చుపూజలు యేమిటికయ్యా యింక నన్న వినియె
కొల్లబెట్టియూ దేవనూరిలో కొల్లగాక యిపుడు
మళ్లివచ్చి మనకోటకెక్కె నబాబుదండు నేఁడు
రంగనాయకుని దేవళంబులో రంతు జేయుచుండ

పొంగుచు తురకలు కోటను ముట్టడి పొసఁగ వేసెదండు
కన్నులుమూసుక యూరకయుండుట ఘనులకు దగవగున
సన్నగాను నీ విప్పుడు కదనము పన్ని వారిసేన
బడలువడంగను బారిసమరి యట బలుకీర్తిని గనుము
జడునిపోలికను యిట్లుండుటలు కడుదీనత వినుము
అని యిటు ధనసింగుఁడు తా బల్కఁగ మనమున గోపించి
ఘనుఁడగు దేసింగుఁడు రంగేశుని కడువడి బూజించి
కన్నులు దెఱచటు ధనసింగునితో కనలుచు నిట్లనెను
ఇన్ని చేసిన నబాబుదండును యిఁక విడువను నేను
పొందుగ తురకలు గుళ్లో జొచ్చిన పూజ లింకనేల
అందు నబాబును నఱికి పూజనే నిందు జేతు చాల
అనుచు విచిత్రపు శాలకువచ్చెను అప్పుడు దేసింగు
పనివడి కాలికి షరాయిఁదొడఁగెను బాలుఁడు దేసింగు
నిలువంగీలు దొడిగినాఁడయా నేర్పున దేసింగు
జలతరుపట్టు ధట్టిగట్టెను జల్దిగ దేసింగు
నరిగెబుటేదా ర్పాగా జుట్టెను చక్కఁగ దేసింగు
పనువడి బుసుసాశాలునగప్పెను బాలుఁడు దేసింగు
కల్కితురాయిని కట్టెను నెత్తిని గ్రక్కున దేసింగు
చిల్కతాలి హారమ్ములు వేసెను శీఘ్రము దేసింగు
పదివేల్తులముల యెత్తుకత్తి చే పట్టెను దేసింగు
ఇదిగా కేడ్వే ల్తులములబాలా యెత్తెను దేసింగు
మూడుమణుంగుల షేష్కబ్జాను ముదమున దేసింగు
గాఢంబుగ దట్టీలో జెక్కెను కదలక దేసింగు
సింగమువలె కూర్చుండె నప్పుడు సిఫాయి దేసింగు
పొంగుచు యుద్ధము గల్గెనేఁడని చెలఁచు దేసింగు

సంగతిహూరకార్లను తా జూచి చయ్యన నిల్లనెను
రంగువిరాద సర్దార్ల నెల్లను రమ్మను కొల్వకును
పిన తండ్రైన ధరణిసింగుని బిరబిర కొల్వకును
పనివడి రత్నసింగును మరిట గోపాలసింగులోను
రామసింగు నాలక్ష్మణసింగును రయమున కొల్వకును
రాముదారిని లక్ష్మణదారిని రమ్మను కొల్వకును
మానిసింగును గిరీపుసింగును మరిమరి కొల్వకును
సేనజేర్చుకొని రమ్మను డిప్పుడు శీఘ్రము నిండగను
అనఁగా హూర్కార్లామెయినందఱు నప్పుడు బిల్వఁగను
పనిబూనియు వారందఱు సేనలు మునుకొని వచ్చియును
రాంరాంరాంజయసీతారాంరాం రాజా దేసింగు
రాంరాం యనఁగను బదులుకు రామని రాజా దేసింగు
జమేదాగులను కన్నులఁ జూచెను జల్దిగ దేసింగు
తమాష చేతను పకపకనగియెను తడయక దేసింగు
మనవి వినవయా యని దేసింగుఁడు పినతండ్రిని జూచి
వినయముతోడుత నిల్లనె నప్పుడు వేడ్క చేయిసాచి
ఎనభై వేల గుఱ్ఱాలున్నది యిచట నబాబుకును
అనయము లక్ష సిఫాయిలు గలరు కనఁగ నబాబుకును
మున్నూ గుఱ్ఱము లున్నది మనకు పిన్నతండ్రి యిఁకను
మన్ననగల్గు సిఫాయీ లేనూర్కంది గలరు యిటను
చాలుచాలు యీ నబాబుగెల్వను చాలు తండ్రిగారు
ఏల యింక నీ సేనతో గెల్చెద చాలతండ్రిగారు
మలకనూరిలో వున్నాఁడయ్యా మహామత్తానుండు
పిలుపింపుము నిమిషములోపలను పిన్నయ్యా నేఁడు
మరిజల్దిగ పంపుము మూడామడ మలకనూరు యిటకు

త్వరలోఁబంపు మటన్నను జూచి ధరణిసింగుఁ డటకు

—దేసింగు తనయిష్టసఖుండగు మహామత్ఖానుని బిలిపించుట.—

అంతట హర్కారులచేతను జా బపుడు బంపఁగాను
గంతుతో మలకానూరిలో మహామత్ఖానుని జూడఁగను
మంగళకరముగ పందిటిలోపల మహామత్ఖానుండు
శృంగారంబుగ పెండ్లిపీఁటపై సొగసుగ నున్నాఁడు
నాగస్వరములు మృదంగములును సంతఝల్లరులును
బాగుగ భేరీనవబత్తులును పరగ మ్రోయఁగాను
చేతను కంకణ మప్పుడు కట్టుక చెలువుమీరఁగాను
చేతుల మంగళసూత్రము నెత్తి చెలఁగి కట్టఁగాను
అల్లారే యల్లారే యనుచు నపుడు కట్టువేళ
ముల్లాశాస్త్రపద్ధతిగాను మొనసికట్టువేళ
గోవిందా గోవిందా యనుచును కోరికట్టువేళ
ఆవేళలో హరకారు లప్పుడు నతనిజూచి చాల
ప్రేమలరఁగ హితుఁడగు దేసింగుఁడు పిలువఁబంపినాఁడు
యేమివ్రాసినాఁడో యీజాబున నింపుతోడ జూడు
జల్దిజల్ది మహామత్ఖానుఁడ జల్ది లేచి రమ్ము
జల్దిగరమ్మనె దేసింగుఁడు నిక జల్దిగాను లెమ్ము
అప్పుడు మహామత్ఖానుఁడు జాబును విప్పిచూచినాఁడు
తప్పక మంగళసూత్రముతట్టలో తాను బెట్టినాఁడు
ప్రాకటంబుగను మహామత్ఖానుఁడు పకపకనవ్వుచును
తేకువమీరఁగ చెంజికిపోవలె తెప్పున నీయెడను
నాకతిమిత్రుఁడు దేసింగుఁడుతా నలమట జెందుటకు
ఈకంకణము పెండ్లికికాదు యెన్న కదనమునకు

యుద్ధమునందు శత్రుల గెలిచి యూరటనొందియును
శుద్ధం బౌకీర్తిని నే పొందియు సూటిగ పెండ్లికను
చేసికొందునని మహమత్ఖానుఁడు చెలఁగి మోహరించి

మహమత్ఖానుఁడు చెంజికిపోవుటకు బంధుజనులను సెలవొసంగుఁడనియడుగుట.

వాసిగ తన బంధువులనెల్లను వడిగ నపుడు జూచి
తగినకొలందిసలాములుచేసి తగయక నంగతికి
తగవుమీరఁగా తనమాటలువిన తనివిపుట్టి యునికి
తెలిసి వారలకు మహమత్ఖానుఁడు ధీరతతోడుతను
బళిరే మీరలు సంతోషముతో బంపవలయు నన్ను
అన్నలార వోతమ్ములార మీ రరసిపెద్దలార
పన్నుగమీ రిచ్చట నుండుండో పఠాణిదొరలార
నేనొకమనవిని చేసెద వినుఁడిది నిమ్మళంబుగాను
పూని నబాబుతో యుద్ధముఁజేయఁగ పోయిట వచ్చెదను
పగవాఁడైన నబాబు చెంజికిని బలములతోరాఁగా
తగదిక నిక్కడ నుండుట నాకును ధర్మము చెడిపోఁగా
ఎదిరియైన నబాబుదండులో నిపుడు నేను జొచ్చి
తుదమొదలిది యని తోఁచఁగనీయక దునిమెద నెద మెచ్చి
అచ్ఛాబహదర్ మెచ్చితి నిన్ను తుచ్ఛసైన్యములను
కచ్ఛపరూపుఁడు కడలిగలంచిన కరణిని యప్పుడును
కలచితివౌరా యని మీరనఁగను కడువడి శూరతను
ఇలగలవారలు నెల్లరు మెచ్చఁగ నీటులసేయఁగాను
మహిలో నెవ్వరు చాలరంచు మీ రందఱు ననఁగాను
విహితంబుగనే బోయివచ్చెదను వేడ్క లుప్పతిలను
అనియిటు మహమత్ఖానుఁడు వెడలఁగ నావృత్తాంతమును

వానితల్లి విని వడిగావచ్చెను వలవదుడుగు మనెను

## —మహామత్ఖానుని తల్లి పోవలదని ప్రలాపించుట.—

ఎదురుగవచ్చి కుమారుని ముద్దిడి యేరా సుకుమారా
ఇది యుద్ధమునకు తరుణమగునే యీప్రొద్దు నిల్వ గదరా
పసిమానంబులు వెరాచికనిన నను బాలుఁడ విడువకురా
అది మొదలుగ నిన్నెంచిన దానిన న్నడలఁగ విడువకురా
బుద్ధిమంతుఁడని నామదిలోను పొంగుచుంటి గదరా
యుద్ధముసేయఁగ బొమ్మన నామన మొప్పదు సుకుమారా
గంధముబూసుక యుద్ధముచేసిన కత్తినరుకు తగులు
సుందర మగుకంకణముతో బోరిన సూటిగుండు తగులు
పసుపువస్త్రముల ననికి ననిపినను పరగ గుండు తగులు
పసివాఁడవు నీ కేల నబాబుతో పరమవిరోధములు
పెద్దలమాటలు విని నీ విప్పుడు పెండ్లికోరత దీర్చి
సిద్ధంబుగ నీ బంధులతోడను జేరి విందొనర్చి
బహుమతులను బహుమతులగుబంధుల బలుసున్నన జేసి
సహజంబుగ వారల దమయూళ్లకు సరగ సనుపఁ జేసి
ఈదిన మిచ్చట నుండియు నీవును యిరవుగాను రేపు
క్రోధముతోడ నబాబుదండును కూల్చి మాపు మాపు

## —మహామత్ఖానుఁడు తల్లిని సమాధానము చేయుట.—

ఆమాటలు విని మహామత్ఖానుండనెను తల్లితోను
ఏమమ్మా నీ విటుల పల్కెదవు యిపుడు చెంజిలోను
నన్నేలిన దేసింగువ్రాసెను నాకు జాబు నేఁడు
నిన్న నబా బట్టు దండునుగూడుక నెదిరించినాఁడు

ఈవేళకు నా చెంజిదుర్గము యేమాయెనో తాని
సావకాశము చేయకూడదిక చయ్యన నే పూని
రెండుగడియలకు లోన నబాబు దండు నణికివేసి
ఖండితముగ సార్కాడుకోటను కాల్చిపాడుచేసి
చెంజిరాజుకు పట్టముకట్టెద శీఘ్రముగా నేను
రంజితముగ సాదుల్లాస్కాతురి రయముగ నెలెగను—లేక
దండున గుండు తగిలి నీల్గినను నిండుపరవి కద్దు
మెండుగ ముందరిపోటునబడితే దండిపరవి కద్దు
పౌరుగ భువిలో పుట్టినయపుడే చావు నిశ్చయమ్ము
పోరజయించిన శాశ్వతకీర్తిని పొసంగ గందు నమ్ము
కినిసి దండులో పోరి తెగినను కీర్తిగలుగునమ్మ
వెనకడుగులు బెట్టుదు రెవరూరులు వింతలు కాదమ్మ
అని యీవిధమున తల్లికిసమ్మతి గనఁబడబల్కియును
చనియెద నిప్పుడు చెంజికి జననీ చాలదీవెనలును
ఒసఁగు మటంచును మహామత్ఖానుం డొప్పుగ నప్పుడును
పసగలసొమ్ములు పట్టువస్త్రములు పరువడి దొడుగుచును

మహామత్ఖానుఁడు నీలవేణియను గుఱ్ఱము నెక్కి చెంజికిపోవుట.

మరిమరితల్లికి సలాముచేసి మహామత్ఖానుండు
త్వరలో గుఱ్ఱపులాయంబునకును తానువచ్చినాఁడు
మున్నూరుగుఱ్ఱంబులలోపలను ముఖ్యంబౌదవఁగను
వన్నెకెక్కువగు నీలవేణియను నాగుఱ్ఱము నటను
గట్టిగకట్టిన యగాడిపిచాడిని ఖడ్గంబున్ననఱికి
దిట్టముగను పురజనులను గనుఁగొని దీవెనలిమ్మనిపల్కి
జల్దియనుచును నీలవేణికిని జాగ్రతదెల్పుచున్[illegible]

జల్లిగ నబాబుదండులో జొరబడి జయమునొందవలెను
పొందుగ జనుమని నీలవేణికి పోషాకిచ్చియును
ముందుగనడువుము నీలవేణియని సందేహించకను
అల్లారే యల్లారే యనుచును అట ధవుడాయించెర
ఎల్లవారు జూడంగను చెంజికి నల్లన నేతెంచెర

మహామత్ ఖానుడువచ్చుచుండఁగా నబాబు సేననుపంపి యడ్డగించుట.

ఆసమయంబున నబాబుసేనలు నతనిజూచి వేగ
మోసము యెవఁడో వొంటిగుఱ్ఱమును వేసుకవచ్చెనుగా
శూరుం డితఁడని తోఁచుచున్నయది చూడగాను యిపుడు
సారస్యముగా దిక ని ట్లుండుట సరగునరం డిపుడు
కొందలమందుచు వారలుమున్నా గ్గుఱ్ఱములను దెచ్చి
సందులేక నడ్డముగానిల్చిన చయ్యన కోపించి
గిరగిరమనుచును నీలవేణితో కినిసి తిరిగితిరిగి
పరువడి మారిమసంగినరీతిని బల్లిబట్టి పెనఁగి
చురుకుచూపులను సేనలఁజూచి యొరనుకత్తి బెఱికి
కరుకుకరుక్కని హయముల నెల్లను గజిబిజిగా నఱికి
పన్నగదిరుగగ గుఱ్ఱములెల్లను భయమునొందె నటను
వున్నసిపాయీల్ కన్నులపడకను క్రన్నన పాఱియును

—మహామత్ ఖానుండు దేసింగును జూచుట.—

మహామత్ ఖానుఁడు చెంజిలొ రాజామహాలు కేఁగి లోన
సహజంబుగ దేసింగునిజూచి సలాంసలా మనిన
బదులు సలాము చేసెనప్పుడు బాలుఁడు దేసింగు
అదిగని మహామత్ ఖానుఁడు మదిలో నంతట నుప్పొంగు
చొనుచు నబాబు సంగతి నిన్నటిదినము దెలిపి తేను

మొనల నభాను జేసి దండును మొత్తివిడుతునేను
ఇత్తటి యుత్తర నై తే నటికెద తుత్తుముగులుగాను
సత్తలేనికార్యం బిది యెంతటిది త్తటిచూడఁగను
అని యిటుపల్కిన మహామత్ ఖానుని మనసెటింగి తెగున
తనరఁగ పెండిలిపీటవిడిచి మొనదాక వచ్చుటకు నగవ
ఆమాటలు యింకేమి యిప్పుడు అన్నా దేసింగు
నామాటలు విను నబాబు నిప్పుడు నణఁచి వానిపొంగు
దండు హల్లకల్లోలంబుగను తాఁ జేయుట గాక
చెండుచు నార్కాడెల్లను పాడుచేసిన యటువెనుక
చెలఁగినబాబుకొమార్తెను పెండ్లి చేసుకొనెద జూడు
చెలువుతొ మీరు పెండ్లికి రావలె సిద్ధముగా నపుడు
అన దేసింగుఁడు మహామత్ ఖానుతో నప్పు డిట్టు లనెను
చని నుసమిద్దఱు నబాబు నిప్పుడు చంపఁగవలె నికను
నావకాశమును చేయఁగూడ దిఁక సంగతి జెప్పెదను
దేవుఁడై నరంగేశు నుత్తరవు దీసుకరావలెను
నగరుకేఁగి నా రాణినిజూచి తగవుబలికి నేను
పగవాఁడైన నబాబును మనము పరఁగ గెలుత మికను

దేసింగు పినతండ్రితో తనభార్యను జూడవలెనని యడుగుట.

నగరికిఁ బోవుచు పినతండ్రితో తా ననియెను యి ట్లనుచు
పగ నబాబుతో గలిగెను గావున తగవును నే గనుచు
పోవలె యుద్ధంబున కటుగావున పొందుగ నా కిపుడు
యీవలె నుత్తరు విప్పుడు తడయక యీవలయును నేఁడు
పోయి రాణిని పొడగని నేను పోయెద నండుకును
యీయెడ నాలస్యము చేయఁగరా దెన్నఁగ మనమునను

ఆమాటలు విని ధరణీసింగుం డపుడు వ్యసనముగాను
యేమిర నాయన నీవిటుపల్కిన నేమిసేతు నేను
తనయా నీవు శుక్రవారమున తగ జనియించినది
ఘనముగ రాణియు శుక్రవారమున తనరంగ బుట్టినది
నీదుగుఱ్ఱమును శుక్రవారమున నేర్పుగ వచ్చినది
యీదండును నాశుక్రవారమున నెలమిని వచ్చినది
వరుసగనీకును రాణికి హయముకు వచ్చిన సేనకును
పరికింపంగను జన్మవారములు వొకటిగ నుండుటను
సరవిని శుక్రునివారం బెన్నగ సామిగ వినునేడు
సరిగాదిరుగుట కదనంబునకును చక్కంగాను జూడు
నేడంతయు నోర్చుక రే పరుగుము నేర్పుమీరంగాను
ఘోడానెక్కి కుజనులు బెదరంగ కొడుకా నీవనెను
సమ్మతి నొందక దేసింగుండుబల్ సాహసంబుతోను
ముమ్మరమగు శూరత్వముతోడను మొసల గలంపంగాను
తలంచిన పనికిని తరియెఱుంగక తారుమారుగాను
పలికెను ధరణీసింగుం డటంచును కలకనొందంగాను

—ధరణీసింగు దేసింగునకు భార్యను చూచిపోమ్మనుట.—

తెలిసి యప్పుడా ధరణిసింగుండు దేసింగుని గాంచి
పలుకరించెద నొకరహస్యము బాగుగ నూహించి
అదివిను మేమన నొకటి యున్నది యే జెప్పెద తనయా
సదయులయిన పెద్దల శాస్త్రంబులు చక్కంగ వినుమయ్యా
ధరణిపుబ్బ యాశ్లేషయు మొదలగు దురితపురిక్కలను
విరిబోడులు ఋతుమతు లయినను కొఱవేసని యందఱును
చెప్పుచునుందురు గావున నీసతి చేటుగల్గు దినము

దెప్పరమగు నీభరణితారను తెలియఁగాను వినుము
మొదటిపాదమున మొదటి రజస్వల ముచ్చటగా నయ్యెన్
అదికారణ మీ వింక నాళ్ళెలలు నతివ జూడ రాదయ్యెన్
నామాటలు విని కొంత దినంబుల నయముగాను గడను
నీమది దోఁచిన కార్యము రేపు నెఱపుము మదివెఱను
పుట్టుచున్నది నాదుకుమారక పొసఁగ వినుము మాట
పట్టపురాణిని చూచుతలంపును మానుము యిచ్చోట
అన నామాటను విని దేసింగుఁడు నతికోపముతోను
తనపినతండ్రిని జూచి యిట్లనెను నయముగ నంతటను
కామాతురుఁడను నేమపర్జితుఁడు ఘనదురవస్థలును
సోమసూర్యు లున్నంతకాలమును చొక్కు నరకమునను
నీమాటల నటు లంఘంగనిమ్ము నిజముగాను తండ్రీ
నేమము దప్పను కదనంబునకును నేనుబోదుతండ్రీ
ముందుబెట్టిన యడుగును నేను మొనసి వెనక నిడను
యిందుకు యోచన వేరేలేదు సందేహించకను
నాకాసంగుము సెలవు వేగమే న్యాయముగా తండ్రీ
యీకార్యమునకై యిపు డభ్యంతర మొనయనీకతండ్రీ
ఈరీతిగ పలికిన యాతనయుని యేపువిరార గాంచి
తీరుగ నీకును రాణికి నడుమును తెరమరి కట్టించి

—దేసింగుం డంతఃపురమున కరుగుట.—

మాటలాడవచ్చుర తనయా యన మది సంతసమునను
తేటగ రాణినగరుకు వచ్చెను దేసింగుం డటను
వచ్చినకార్యము హర్కారులతో వదలక చెప్పినను
అచ్చటి యంతఃపురవాసులతో నమరఁగ దెల్పఁగను

దాదులుపోయి రాణితో బల్కిరి తడయక నప్పుడును
వోదెపే నీ ప్రాణనాథుఁ డిదె వొప్పుగవచ్చెను కనను
రమ్మనుమని సెలవిచ్చెను వేగమె లెమ్ము రాణి యనను
సమ్మతించి సంతసమున లేచి కమ్మనిజలమునను
స్నానముచేసి చలువదుకూలము చక్కఁగ నవరించి
మానుగ పట్టు జిలిబిలిరవికెయు మమతతో ధరియించి
పన్నీ రత్తరు గూర్చిన కలపము బాగుగాను నలఁది
కన్నులకాటుక ముఖమునతిలకము తిన్నఁగాను దిద్ది
కరకంకణములు కాళ్లగజ్జెలును కంఠసరంబులును
సరిపెణలును మెడనూలు రాగిడియు జడనుకుచ్చులును
బాగడలు కమ్మలు జుమికీల్ బేసరి బులాకునత్తులును
నిగనిగ మెఱసెడి యొడ్డాణంబును సొగను మెట్టియలును
మొదలగు నాభరణంబు లన్నియును ముదముమీర దొడిగి
పసపడి సొంపులు గులికెడి సొగసున పరిథవిల్లి కడఁగి
పొసఁగ మల్లెలు మొల్లలు కొప్పున పొందుగానుముడిచి
ముసిముసినగవుల తోడసఖులునగు ముదితలతో వచ్చి
తెరచాటున ఘల్ఘల్లని నిలిచిన దేసింగుం డటను
వరసతిగూరిచి నాసిగ నిట్లనె పరమదృఢంబుగను
మరువకవినను నాప్రాణనాయకీ పౌరుషవిషయమును
సరసతలేక నబాబు సేసలను చయ్యన గూర్చియును
దండు చెంజిపై దెచ్చి యిప్పుడు దలపడి యుండఁగను
ఖండితముగ నే నబాబుతోడను కయ్యముచేయఁగను
తెంపునబోవలె నిన్నుజూచుటకు సొంపుతోడ నేను
యింపుగవచ్చితి నిఁక క్షణమేనియు నిల్వఁగూడ దిటను

—రాణి దేసింగుని యుద్ధమునకు పోవద్దని సంవాదము సేయుట—

అన దేసింగునితోడ రాణి తానప్పుడు గ్రక్కునను
ఘనమగు వ్యసనముతోడ బల్కెను తనమది బొగలంగను
నబాబుతోడను యుద్ధమువలవదు నాదుప్రాణనాథ
జబాబు సరిలేదని కోపించకు స్వామి మనవి బాధ
కలుగు నటంచును తెలిసి చెప్పితిని యలసట నొందకను
వెలయుముదంబున నేను చెప్పితిని విస్తరంబుగాను
ఆదరింపంగావలె నాపలుకులు భేదము దలంపకను
ఆదిదేవుం డౌరంగని ధ్యానం బరసిచేయు మింకను
కోటకువెలుపట యుద్ధము చేయంగ వాటముగా దిపుడు
సాటిగాదు తురకలతో యుద్ధము స్వామి మనవి యిపుడు
జయకాలము మన కిపుడులేదిది ప్రియనాథా వినుము
నయముమీరంగా సంధిక్రియలను ప్రియమున నొనరుపుము
ఇటువలె జెప్పిన రాణిని గనుంగొని యిట్లనియెను నపుడు
పటుతరమగుదం డెల్ల కోటపయి పనివడి రా నిపుడు
కృపణత నూరక నేనుండిన నక్క కృపణుండనరె యిలను
అపకీర్తియు లోకాపవాదములు నరయంగ నాకగును
అన దేసింగునితోడ రాణి తానప్పుడిట్టు లనెను
మనమున గుందుచు పరితాపంబున తహతహ నొందుచును
స్వామి మీరు నన్నగ్నిసాక్షిగా చయ్యన చేపట్టి
ప్రేమను సుఖముల ననుభవించకను వెనంకను తల పెట్టి
తెగువకు జొరగా తగవగునా మీ మగంటిమి జూపంగను
తగుతటి యిదిగా దని తోచెడు నాదగు మనమందునను
ఇటు జెప్పిన తనరాణితోడ దేసింగుం డిట్లనెను
పటుతరముగ నే నందున జొరబడి పరుల జయించినను

తటుకునవచ్చి నిన్నే లెద నే తప్పకయిప్పుడును
చటులధైర్యమున శత్రులద్రుంచెద సత్యంబుగ నేను
రాక దండులో నీల్గిన స్వర్గము ప్రాకటముగగలదు
చేకొని జయమును జెంది వచ్చినను చిరకీర్తియుగలదు
అన దేసింగునితోడ రాణి తా నప్పుడిట్టు లనెను
ఘనవిక్రమమున దండునజొచ్చి గ్రక్కున వీరలును
ముందుసఱుకునను పుడమిని బడినను ముఖ్యంబుగ నేను
సందేహములేకను జేసెద విను సహగమనము తగను
వెన్నుపోటుచే ధరగూలిన మిము కన్నులతో గనను
పన్నుగాను నే కట్టిడిప్పింతును పాతచెంజిలోను
అనిచెప్పిన యారాణితో దేసింగపుడు యిట్టు లనెను
ఘనతరమగు నీ వాక్యము నాకును కడుముద మొదవఁగను
ప్రీతియొనర్చెను సొంపుగనైను పిఱుతవియక నేను
ఖ్యాతిగ యుద్ధము చేసి బిరుదులతో కడువడి వచ్చెదను
నాదుపరాక్రమమునకును దగినది నీదగు ధైర్యమును
నీదుపలుకులకు సంతసించితిని నే నికపోయెదను
అనఁగా రాణియు నతిహర్షముతో నపుడు చెలుల బిలిచి
ఘనతరవస్తుయుతంబుగ పీడెము మనసులరఁగ దెప్పించి
ఆరసి శత్రు జయింపఁగ తాంబూలంబు నిచ్చునపుడు
తీరుగ నాతని చెయిశృంగారము తెలఁగుచూచి ధవుఁడు
పాటవమున సేనలనెల్లను తా బడలుపరచునంచు
మేటివిలాసముతోడ శత్రులను మృత్యువు నొందించు
అని సాముద్రికశాస్త్రము దెలిసిన ఘనమతిగావునను
తనమది నిశ్చయ మాదరించెను తరుణీమణి తాను
నాథుని శృంగారము జూచుటకును నాకు ప్రాప్తి లేదు

నాథుని కూటమి లేదని బ్రహ్మ నాకు వ్రాసె ముందు
కన్నులనీరు నించుచు తన ప్రియకాంతునిచె య్యటను
కన్నులనొత్తుచు నేడ్వఁగ చెయి తా గ్రక్కున వెనకకును
తీసుకొనియును తెప్పున నాతఁడు తెలివిని విలసిలుచు
వాసిగ గుఱ్ఱము నెక్కుట కప్పుడు పరువడితో జనుచు.

—దేసింగు చోపుదారిని గుఱ్ఱమును శృంగారించి తెమ్మనుట.—

పదపడి గుఱ్ఱపులాయంబునకు పటుగతి నరిగియును
అదలించియు చోప్దారిని బారాహజారి దెమ్మనెను
అప్పుడు బారాహజారి నటచోప్దారి తేగజూచి
తప్పక శృంగారించుట తెమ్మని యప్పుడు సెలవిచ్చి
రంగులపక్కైము బంగారుజీనియు రంజితంబుగాను
శృంగారంబగు రికాపులను బల్ సొంపుతో వెలయఁగను
చిల్కతురాయి శిరమునందును చెలువుమీర బెట్టి
తళ్కులబంగరుబిళ్లలదండలు దనర మెడనుగట్టి
పట్టుకుట్రినీ పచ్చడంబుబల్ పై కప్పునుగప్పి
దిట్టము బారాహజారి చోప్దార్ దెచ్చి మనవిజెప్పి
నంతట దేసింగుఁడు తన బారాహజారి నటుజూచి
సంతోషంబున సుబేదార్లను సరగజూచి లేచి
బారాహజారి దగ్గఱకొచ్చి పయినచెయ్యి వేసి
ఏరా బారాహజారి నేను యీ నబాబుగెలిచి
వచ్చినరత్నాల్ భూషణముల నీ కిచ్చెద వేడుకను
హెచ్చుధైర్యమున దండులో నీవు జొచ్చి తిరుగవలెను

—బారాహజారి వ్యసనము జెందుట.—

అన్నను బారాహజారి కంతట నతివ్యసనము దోచి

కన్నులనీరటు కారుచుండ తన కాలు దిగువరాచి
ధైర్యమువిడిచియు తోకనెత్తికొని తల నేలకు వంచి
శౌర్యము దూలి నోట నురుగురా చప్పళ్లను వైచి
ఉన్నగుఱ్ఱమును దేసింగుఁడు గని కన్ను లెఱ్ఱజేసి
యెన్నడు నిట్టుల నుంటవు బారాహాజారి నినుడాసి
కాపాడితి నను మోసముజేయుట గలదె సమయమందు
సాపుగ మేతకు పదివేల్ వరహాల్ చనియె ఖర్చులందు
పెంపుగ వులవలు వలదని సెనగలు పెట్టిస్తినె నీకు
తెంపుతో తేఁత కసువు మోపులను తెప్పిస్తినె నీకు
నీళ్లకుబదులుగ సారాయ్ తెచ్చియు నీకును పోయిస్తి
వొళ్లికిమెత్తగ దూదిమెత్తలు వొనరగ పఱిపిస్తి
కళ్లెము మొదలుగ నవరత్నములతో ఘనపోషాకెపుడు
చెల్లముగా చేయిస్తినె నీకు చెలఁగి మోస మిపుడు
యేలచేసెదవు తెలివిలేక నిఁక నేజెప్పెద వినుము
చాలఁగ భువి యీ జన్మమెత్తితివి మేలుకీర్తిగనుము
ఆరులోచావు నూరులోచావు అది నిశ్చయముగను
ధీరత యుద్ధములో జచ్చినను చేకురుపరమునను
పుట్టినప్పుడే చావునిశ్చయము పుడమి నందఱికిని
గట్టిగ యిదినీ మనసున నిల్పుము కడుధైర్యముపూని
అన విని బారాహాజారి యంతట నతిధైర్యముతోను
ఘనమగు దేహము ఝలిపించంతట గర్జన జేయుచును
ఉన్నగుఱ్ఱమును దేసింగుఁడుతా నొప్పుగానుమెచ్చి
సన్నుతుఁడగు నారంగనాయకుని సన్నిధి యట జొచ్చి

**దేసింగు రంగనాథుని వద్దికిఁ బోయి యుద్ధము చేయుటకు సెలవడుగుట.**

తిరుమంజన సామాను పుష్పములు దివ్యవస్త్రములును
వరమణియుతభూషణములు గంధము వాసనద్రవ్యమును
పరిపరివిధముల నైవేద్యంబులు బహుదీపాదులును
రంగనాథుని సన్నిధి జేర్చి రంజితంబుగాను
బంగరుపువ్వుల బూజించియును భక్తియుక్తముగను
రంగనాయకుల కెదుట నిలువఁబడి పొంగు మనముతోను
రంగుమీరఁగా దేసింగుఁడు శ్రీరంగని ధ్యానించి
శృంగారంబుగ పూజలు జేయుచు చెలఁగి నివేదించి
వాసిగ నా దేవునికిని మ్రొక్కియు పరమభక్తితోను
ఈసమయంబున గాపాడగదే శ్రీశ ప్రేమతోను
నారాయణ శ్రీరంగ కేశవా ఘోరకలుషహరణా
వారిజాక్ష వైకుంఠనివాసా శూరదనుజ మదనా
తల్లివినీవే తండ్రివినీవే దాత భ్రాత వీవే
యెల్లలోకముల కాధారంబగు యాదికర్తవీవే
కాచినత్రోచిన నాచెలికాఁడవు బ్రోచుదైవమవును
ఓచక్రధరా నీవేయని నే నుల్లము లోపలను
నమ్మికనున్నాఁడను ఈతఱినే నెమ్మదిలో నెంచి
కమ్మికవచ్చు నబాబుదండును కడువడి ఛేదించి
జయమునొసంగుము జలచరరూపక జలజపత్రనయనా
జయజయ శ్రీహరి శత్రుహారి భుజంగరాజశయనా
అని వేవిధముల బొగడియు తనమది నపుడు శ్రుతముగాను
ఘనమగు భక్తిని మఱిమఱి మ్రొక్కుచు వినయముతోడుతను
బారాహజారి పైనెక్కియును బలిమిని దేసింగు

తా రమ్యముగా జననెంచియును తటుకున దేసింగు
ప్రాణిసబాబుతో యుద్ధము సేయఁగఁ బోవుచు నున్నాను
మానక జయమును కలుగజేయుము మరువగవల దనెను

## —దేసింగు రంగనాథునియెడల మర్త్సనములు గనుట.—

తటుకున ఘాసునే గిరగిర తిరిగెను తానుసూపగాను
ఒటువగు దేవుని మెడలో హారం బట తెగి భువిపడెను
పటుపటుమని గోపురశిఖరంబులు పడెను భూమియందు
చటులతరంబుగ రాలెను చుక్కలు తటుకున పగలందు
చుట్టుచీకటులు క్రమ్మె నప్పుడు జూచువారికెల్ల
అట్టె యఖండము లారెను దేవుని కణఁగె తేజమెల్ల
ప్రక్కన స్వామియు ముఖమును పడమటిదిక్కు ద్రిప్పె నటను
అక్కడ దేసింగుఁడు రోషంబున ననెను స్వామితోను
యేమిర రంగా నీ విప్పుడు నన్నిటుల సేయనగునా
స్వామియనుచు నిను నమ్మినందు కిటు జేయ నీకు తగునా
గొప్ప దేవళము ప్రాకారంబులు నిప్పుడు కట్టిస్తి
తప్పక బంగరుధ్వజస్తంభము నిప్పుడు చేయిస్తి
కల్కితురాయి కంఠసరంబులు కనకవైరముడులు
చిల్కతాళియు హారంబులు మంజీరకంకణములు
నిత్యపడితరము దీపారాధన నిత్యోత్సవములును
ప్రత్యేకంబుగ పంచపర్వముల బ్రహ్మోత్సవములును
అరయఁగ నీకొక తక్కువ లేకను నడిపించితినేను
యిరవుగ నాకు సదుత్తర మిప్పుడు నియ్యక నుండినను
ఇచ్చిన పోయెద నింకమీఁద నీ వేమి జేసినాను
యిచ్చను ధైర్యము దొలఁగదు నాకు నెన్నికమీరఁగను

అని యటనిలువక చనియెడిరాజుతో నంత రంగఁ డనెను
వినునాపలుకులు దేసింగుఁడ నీవిపుడు ప్రియంబునను
ఘనతరబలముల గెలువఁగజనుము కడువడి దేసింగు
వెనకదీయకను వైరులగెలువుము వేగమె దేసింగు
మనమున నీకును కొదవయు వలదు బాలుఁడ దేసింగు
పనిబూనియు నొకముహూర్తమాత్రమె బాలుఁడ దేసింగు
నీపాలిట నేనుండెద దండున నెప్పుగ దేసింగు
సాపుగ నటికియు సంహారింపుము చయ్యన దేసింగు

## దేసింగు యుద్ధమునకు జనుట.

అనఁగా సంతసమున రాజంతట హాజారి నెక్కికొని
తనసహాయులతో సుబేదారులను తానట బిల్వమని
చెప్పిన రాంసింగ్ లక్ష్మణసింగుల తెప్పున నప్పుడును
తప్పక హీరాదాసు లక్ష్మణదాసుల నంతటను
ధరణిసింగును మానిసింగును కరుణాసింగులను
నరహరిసింగు నారణసింగు మురారిసింగులను
రత్నసింగు గోపాలసింగును రాజాసింగులను
అతిత్వర పేటశిపాయీ మహామత్ ఖానుల నప్పుడును
రమ్మనిచెప్పిన దూతలుజని వారందఱు విడుదులకు
సన్నద్ధమున జని తెలియజెప్పఁగను సాలుగ యుద్ధముకు
తమతమగుఱ్ఱము లెక్కి కత్తులు దాల్చి వారలంత
అమితబలంబుల జేర్చుక నప్పుడు అట నిలచిన నంత
సేనలఁగనుఁగొని సంతసమున దేసింగుఁడు పొంగుచును
తానటు భేరి వేయించెను ధంధణధణమనఁగాను
కరుకున దేసింగుఁడువచ్చుటను యెఱుకసేయుకొఱకు

సారెకు నప్పుడు బంగార్నాయుఁడు జేరి నబాబునకు

—బంగార్నాయుఁడు దేసింగు వచ్చువిధంబు నబాబుకుదెలుపుట.—

సలాముయ్యావో సలామునీకు సాదుల్ ఖానుఁడా
బలేశూరుఁడై దేసింగుఁడు బహుబలములతో గూడ
సింగమువలెనే దేసింగుఁడును చెలఁగివచ్చె నిదుగో
అంగము లదరఁగ పులిచొప్పున, దేసింగుఁడెదిర్చెను యిదిగో
మదపుటేన్గువలె దేసింగుఁడును మదివచ్చెను నేఁడు
కదసి కృష్ణసర్పమువలె నిప్పుడు కదలివచ్చె జూడు
యిదె దేసింగుని దండువచ్చెను యేమిచేయఁగలము
చెదరియున్నదే మనదండెల్లను యిది మనమున గనుము
ఇప్పుడు యోచన సేయఁగ నాకును యేమితోఁచలేదు
చెప్పెద నొక్క యుపాయం బున్నది తప్ప వేరె లేదు
మల్లిచెట్టు మునిగున్నది నీళ్లను మలయనూరిచెఱువు
మిట్టుగతాయూ నూరిచెఱువులో మేటినీళ్లుగలవు
చెఱువులు రెండును కొట్టి శంకరాభరణమేటిలోన
బరువడివిడిచిన దాటగూడదు మనుజులందులోన

నబాబు బంగారునాయనికి చెఱువులుతెగఁగొట్ట నుత్తరు వొసంగుట.

అనిచెప్పిన బంగారునాయని యాననంబుజూచి
ఘనమగుచెఱువులు తెగఁగొట్టుమని కడువడి సెలవిచ్చి
నంతట బంగార్నాయఁడు వేగమె నన్నాటికి జనుల
కొంత జేర్చుకొని రెండుచెఱువులను కొట్టిన నీళ్లెల్ల
నిండి శంకరాభరణమేటిలో మెండుగ పొర్లుచును
చెండుచు బుసలుగొట్టుచు వచ్చెడి సర్పంబులవలెను
వడిగా కొండల పొర్లించుకొని వచ్చుచున్న వేళ

తడయక బంగార్నాయఁడు దండును దనరఁజూచి చాల
వ్యూహముచేసి దండునెల్లను వొప్పజేయవలెను
మోహరమున కనములు యేర్పఱచి ముందు నిల్పవలెను
అనుచు నబాబుతో బంగార్నాయం డపుడు చెప్పఁగాను
విని నబాబు యిదె యుత్తరమనుచును వేగజెప్పఁగాను

బంగార్నాయఁడు బందోబస్తుగా వ్యూహముకట్టుట.

మొదటికనములో సుభంగిదొరను ముఖ్యంబుగ నుంచి
గతియం చబ్దుల్ ఖాదరు రెండవ కనములోన నుంచి
ఘనముగ దావుత్ ఖానునిమూఁడో కనమును నిల్పియును
మనమలరఁగ ఖాసాయబు నాల్గో కనమందు నిడెను
అరయఁగ గండికోటసుబేదార్ నైదో కనమకును
గుఱుతుగ నాఱవకనమకు కలవకోటసుబేదార్ను
యెన్నఁగ నారణివెంకట్రావును యేడవకనమకును
పన్ని యెనిమిదవ కనమకు చెంగల్పట్టుసుబేదార్ను
దురుసుగ తిమిరీషేకుమహమ్మదు తొమ్మిదో కనమకును
అరయఁగపదియవ కనమకు సాదుల్ ఖానుని నిల్పియును
ఈరీతిగ బంగార్నాయఁడు యేర్పాటటు గావించి
సారెకు తానును వ్యూహముచుట్టును సవ్వరిచేసివచ్చి

దేసింగు తన సేనలకు దిట్టపఱచుట

ఉన్న నచ్చటను దేసింగుఁడు తానున్న సుబేదార్ల
కన్నులఁగనుఁగొని యిట్లని పలికెను కదసి వారికెల్ల
ఆలుబిడ్డలు బంధుల మీఁదను ఆసగలిగియున్న
చాలఁగ ధనధాన్యంబులపై నాసలు మీకు పున్న
పొండి డింఢ్లకును ధైర్యశౌర్యములు పొసఁగ లేనివారు

రందుప్రాణముల మీఁద దృష్టి లేకుండువారు మీఁక
యుద్ధములో దెగిపడ్డవారికి నొప్పుపదవి కద్దు
యిద్దరలోపల గెలిచినకీర్తులు నెక్కువగా కద్దు
అని దేసింగుఁడు పల్కుచు బారాహజారి గదలించ
మొనసి సుబేదా ర్లంత గుఱ్ఱముల ముందుగ నడిపించ
వచ్చి శంకరాభరణముగట్టున పరుసగాను నిలిచి
యచ్చట వచ్చెడి పినతండ్రిని తానంత తిరిగి చూచి

పినతండ్రిని దేసింగు పెల్లున యొచ్చటనుండి వచ్చెననుట.

ఇంతకుముందుగ నీళ్లు లేవు బిరా యేటియందు ముందు
గంతులు వేయుచు వచ్చుప్రవాహము గంటి నిప్పుడు యిందు
అనిపల్కిన దేసింగునితోడను పినతండ్రియు ననిమొ
ఘనముగ బంగార్నాయనిసేనల తనయా యిటుల య్యొక
తాయము లయనూర్చెఱువులు రెండును తగ తెగగొట్టిపుడు
పాయక శంకరాభరణ మేటిలో పరగవిడిచినాఁడు
తెప్పున రెండుఘడియల లోపలతీసిపోను వినుము
తప్పక నప్పుడు యాగట్టునకును దాటవచ్చు మనము
అన విని దేసింగుఁడు పకపక నగి యయ్యవినుము నేఁడు
మనకును భయపడి చెఱువులు త్రెంచిన మఱినిలుతున చూడు
పన్నెండంకులు గలిగినట్టి బిరా బారహజారియును
ఉన్నతమైన గుఱ్ఱముతోనే నొప్పుగ దుముకుదును
అని యప్పుడు తా బారహజారిని తనరఁగ తట్టుచును
ఘనధైర్యంబున దేసింగుఁడు తా కడువడి దుముకఁగను
రామసింగుఁడు లక్ష్మణసింగుఁడు రత్నసింగుఁడును
రామదారియును లక్ష్మణదారియు నంత గుఱ్ఱములను

మానిసింగుఁడును పేటసిపాయి మహామత్ ఖానుఁడును
పూనిగుఱ్ఱములతోడ నప్పుడు పొందుగ దుముకఁగను

సేనలు యేటిలో దిగి ముప్పదిగుఱ్ఱములతో యావలి గట్టు చేరుట.

గుబగుబగుబగుబగుబగుబయనుచును గుఱ్ఱంబులు దుముక
తటతట నీదుచు నీరును నోట తీసి యుమిసెబాగ
రెండుఘడియల మారమున్న యానిండు యేటియందు
కొండలుడొల్లిన యట్టుల కొన్ని గుఱ్ఱంబులు నందు
పోయెపోయెనని యేటిలోనఁబడి పోయిరి కొందఱును
ఆయెడ యేటిలో దిగకను కొందఱు పోయిరి యూళ్లకును
చిక్కిన ముప్పదిగుఱ్ఱము లప్పుడు యెక్కిరి యాకడను
తక్కినవారలు యెందఱుపోయిరో లెక్కలేదు వినను
సలాము సేయుచు నిలబడియుండఁగ సరదార్లందఱును
బహుహోషుతో మహామత్ ఖానుఁడు బల్కె రాజుతోను

దేసింగును మహామత్ ఖానుఁడు యుద్ధము చేయుటకు ఉత్తరవిమ్మని యడుగుట.

మనవి వినుము మహారాజా నేనొకమాట చెప్పుకొనెద
చనినబాబుతో మొదటియుద్ధముకు సైయని నేఁజనెద
పోవుటకును నొకఘడియవుత్తరవు పొసగ నియ్యవలెను
దేవరవారలు సెలవొసంగుటలు సావకాశమేను
క్రమముగ కనమలు గొట్టి దండులో గ్రక్కున నేఁజొచ్చి
నిమిషమాత్రములోన నబాబును నేను నఱికివచ్చి
మనవిజేసెదను వుత్తరమొసగుము మన్ననతోడుతను
అని యడిగిన నా మహామత్ ఖానుని యపుడు జూచి యనెను

మహామత్ ఖానుని దేసింగుఁ డొంటిగా యుద్ధమునకు బోవద్దనుట.

పకపకనవ్వుచు మహామత్ ఖానుని బహుశక్తికి మెచ్చి
యొకడేకొడుకవు తల్లికి నీవు వొప్పదు యిట వచ్చి
పసుపువస్త్రములు కంకణంబుచే పరగదాల్చి యిటను
పసివాఁడవు వొంటిగ యుద్ధంబును పొసఁగదు చేయఁగను
నేను నీవును గూడి యిప్పుడు నెరయ దండులోను
పూని యుద్ధము నబాబుతోడను పొసఁగఁ జేయఁదగును
అనవిని మహామత్ ఖానుం డప్పుడు అనియె రాజుతోను
మన మిద్దఱమును గూడి నబాబును మడియించిన నిలను
నీకబ్బును చిరకీర్తి విశేషము నెచ్చుగ దేసింగు
నా కేకీర్తియు గలుగనేరదు నయముగ దేసింగు
అన విని నవ్వుచు దేసింగుం డా మహామత్ ఖానునితో
చని ముందుగ నీ విప్పుడు యుద్ధము సలుపుమనఁగ నెంతో
శౌర్యంబున నా నీలవేణిని చయ్యన తాటించి
ధైర్యంబున నా నబాబుదండును తాను జూచి మించి

మహామత్ ఖానుఁడు ముందు సుభంగిదొర నెదిరించి యుద్ధముసేయుట.

పటపటపటయని ధవుడాయించెను పరగ నీలవేణి
చటులపరాక్రమమున తా నొప్పెను చయ్యన నటు పూని
వ్యూహము జేసుక నుంచుదండు తా నొప్పగాను జూచి
మోహరంబున సుభంగిదొరను ముందుగ నటు గాంచి
చాలఁగ చిమటా యిచ్చె నప్పుడు నీలవేణికిని
మేలుగ మొకముకాలి కిచ్చెను నీలవేణికిని
ఇచ్చిన బిరబిర నీలవేణియు జొచ్చె దండులోన
చొచ్చిన జూచి సుభంగిదొర తా నచ్చట వేగమున

మూఁడు వేలగుఱ్ఱంబుల దెచ్చి మోహరంబు జేసి
తోడనె తా నొక యేనుఁగు నెక్కఁక తొడిబడ నట డాసి
నిలిచిన మహామత్ ఖానుం డప్పుడు నీలవేణికిని
చెలువంబుగ బొమ్మని సెలవిచ్చిన చయ్యన నటువూని
చొఱబడి గుఱ్ఱంబుల రౌతులను తఱిమి తఱిమి యటను
కలుకుకలు క్కని సొరకాయలను నఱికిన తీరునను
గిరగిర మనుచును కత్తి ద్రిప్పుచును కినిసి దండు నెల్ల
సరగున నఱికిన మొండెంబులు ధర నరుదుగ బడి డొల్ల
ముందు నఱకునకు మున్నూరుగుఱ్ఱము లందంబుగ దెగియె
కొందలమందగ వెనకవిసరుకు కొన్నిగుఱ్ఱములు పడియె
యేనుంగుల గుఱ్ఱంబుల భటులను హెచ్చుగ రౌతులను
మానక మహామత్ ఖానుం డప్పుడు మడియఁజేసి యటను
తొడిబడ పేటసిపాయి సుభంగిదొర నప్పుడు చూచెను
తడయక నీలవేణికి సైగలు వడిగ దిరుగనిచ్చె
వచ్చెడి మహామత్ ఖానుని యెదురుగ వైరులు బెదరఁగను
యెచ్చుగ నిరుమూడ్వేలగుఱ్ఱముల నచ్చట నిలుపఁగను
నీలవేణిని ధవుడాయించి వేలసంఖ్యలైన
చాలఁగ కత్తితొ తుండ్లుతుండ్లుగా కూలనేసి సైన
శీకొనివచ్చెడి దండు నెల్లను తెగువతొ నఱకఁగను
మోకరించుకొని పడి రంతటను మొనటికనమలోను
ఉన్నసుభంగి దొరను కనుఁగొని కన్నులెఱ్ఱఁజేసి
యెన్నఁగ గుఱ్ఱముతోపను వాసి యేనుఁగుపై గదిసి
మహామత్ ఖానుఁడు సుభంగిదొరను మరినఱికెవ ననఁగా
తహతహబడుచును కాళ్లుబట్టుకొని సనర వేఁడె వేగా

### మహామత్ ఖానుని సుభంగిదొర చంపవద్దని వేఁడికొనుట.

అన్నా మహామత్ ఖానుఁడ నీవు నన్నువిడువవన్న
మన్నన జేయుము నీతమ్ముఁడను నన్నుగావు మన్న
తెలియక యుద్ధంబునకు వచ్చితిని చలము వలన దన్నా
కొలిచెద నిన్ని ప్పుడు దైవంబుగ కొట్టవలవ దన్నా
తల్లియునీవే తండ్రియునీవే దాత భ్రాత నీవే
యిల్లు నిలుపు నే పిల్లలవాఁడను యిచట దిక్కునీవే
అనిన సుభంగిదొర నొకచెయ్యి నంతట బట్టుకొని
ఘనముగ బలికెను మహామత్ ఖానుఁడు కడునుగ్రతపూని
పోటరివలె యుద్ధంబునకొచ్చి పొంకము చెడి యిపుడు
మాటలాడితే విడుతునె నిన్ను మడియింపక నేఁడు
యింతపిరికిబంటువయితే నీవును యింటనుండక వలెను
కొంతసేనగొని యుద్ధంబునకును గొనకొని వచ్చినను
విడువనంచు యేనుఁగుపైనుంచి వేగ దిగుపడ్రోసి
కసువడి కత్తితో కుడిభుజంబును కఱుకని తెగవ్రేసి
చంపఁబూనిన మహామత్ ఖానుని చయ్యన నటుజూచి
చంపవద్దని యెడమచేతితో సలామనుచు వగచి
గోడుగోడని సుభంగిదొర పడి యేడ్వఁగ తానపుడు
వీడు కోనయని మహామత్ ఖానుఁడు విడువ నంత వాఁడు
పరువడి నొక్క చెయ్యితో వాఁడు పరుగెత్తెను నంత
తిరిగటు నీలవేణికి చిమటా నురియిచ్చెను కొంత
బిరబిర దండులో జొరబడి కత్తిని గిరగిర ద్రిప్పుచును
తఱుముచు నఱుకుచు నుఱుకుచు బలమున తడబడఁ జేయుచును
పదివేల్ గుఱ్ఱంబుల నొకసారిగ పట్టియు తుంపించు
గదియించియు నాసేనల నెల్లను ఖండితముగ ద్రుంచు

పక్కలు పిక్కలు చెక్కలు ముక్కలు వ్రక్కలుగావించు
అక్కడి వీరుల చక్కఁగఁబట్టియు డొక్కలు వెస జించు
దండిగుఱ్ఱముల మొండెంబులుగా ఖండంబులు జేయు
చెండుచు నేనుఁగు తొండంబులను తుండ్లుతుండ్లు జేయు
మెడలు తొడలును కాళ్లు చేతులు కడువడి నఱుకుచును
వడిగలరౌతుల కడువడిబట్టి మడియఁగ జేయుచును

మహమత్ ఖానుఁడు శేఖుమహమ్మదుతో ద్వంద్వయుద్ధము సేయుట.

వెయ్యేనుఁగులతో శేఖుమహమ్మదు వెలయుచుండ గాంచి
యయ్యెడను యీ మహమత్ ఖానుం డటుబోవఁగఁదలఁచి
చాలగ మహమత్ ఖానుఁడు చిమటా నీలవేణికిని
మేలుగ యొడముకాలి కిచ్చెను నీలవేణికిని
యిచ్చిన నీలవేణి యప్పుడు నచ్చట నిలువకను
పశ్చిమదిక్కున శేఖుమహమ్మదు పరగ పంతులోను
వడిగా దూఱుచు మహమత్ ఖానుఁడు వదలక యేనుఁగుల
కడువడి తొండలు ప్రేవులు కుప్పలుగాఁ జేయుచు చాల
యేనుఁగగుంపులు గొండలువలె బడ నిలువార్లగ సేసెన్
పీనుఁగు పెంటలు గాఁగను మహమత్ ఖానుఁడు తెగగోసెన్
ఇటులనుండ నా శేఖుమహమ్మదుఁ డేసినా నేనుఁగుల
పటుతరంబుగా ముందుబంపఁ గని పటుకోపము లీల
వచ్చు నేనుఁగుల మహమత్ఖానుఁడు వడిగా జూచుచును
హెచ్చినశౌర్యము తోడ నప్పుడు నచట కత్తితోను
యొగబడ నఱుకుచు తెగబడిపోవుచు యేనుఁగు లన్నియును
ధగధగ మెఱసెడి కత్తిని ఝుళిపుచు తెగువతో విసరఁగను
విఱిగినకాళ్లు తఱిగినమెడలును వొరిగినముండెములు

వెరగుబడియునే తెరవుగానకా తఱినిలిచిన భటులు
బిరబిరబారగ నలుకులు బడియును ధరగూలెడివారు
పరువులిడుచు నా మహమత్ఖానుని తిరిగిచూచువారు
యుద్ధము జేయుటకును రాలేదని యెదిగి చూచువారు
బుద్ధిలేకవచ్చితి మయ్యా యని పొగలునట్టివారు
నిక్కంబుగ మము జంపగవలదని మ్రొక్కివేడువారు
యెక్కడబోదము యేది దిక్కు యని యిటుల వగచువారు
యీరీతిని నుండగ దండెల్లను తారుమారుసేసి
వారకనీలవేణికి చిమటా వడిగా నవు డిచ్చి
కదలిచి హయమును శేఖుమహమ్మదు కడకు బోవనిచ్చి
యదలించిన నా నీలవేణియును నంత చౌకళించి
యేనుగుతలమీదను తనకాళ్లను యెగిరిపెట్టగాను
తానటు మహమత్ఖానుడు గుఱ్ఱై దనరగ బట్టియును
కత్తిదీసుకొని హుంకరించినను కనుగొనివాడంత
నెత్తికిసరిగా మహమత్ఖానుని నేయతప్పకంత
పూని కోపముతో మహమత్ఖానుడు వానితలను చేత
మానక కత్తితో వేయదలచినను మరివాడును కొంత

—శేఖుమహమ్మదు మహమత్ఖానుని చంపవలదని వేడుకొనుట.—

లేయుచు గటగట వణకుచు మరిమరి వేడుకొనుచు నేను
పోయెద విడిచిపెట్టిన హాజరత్ ప్రోవుమి నన్ననను
కావుమనుచును కాళ్ళుబట్టుకొని ఘనముగ నేడ్చుచును
నేపరుండెదను నీకును నేను కావుకావు మనెను
ఇల్లునువిడిచి బిడ్డలవిడిచి యిల్లాలినివిడిచి
వెళ్లివచ్చితిని పూరకె నిప్పుడు వేడుకగాదలచి
వచ్చితి యుద్ధము జేయవచ్చిన వాడగాను నేను

యిచ్చుట ప్రాణము బోగొట్టక నన్నిపుడు విడువవలెను
తల్లిదండ్రి నీవని నే నిప్పుడు దనరంగ వేడెదను
అల్లాసామివి నీవేయనుచును అరసికొలిచెదను
సలామయ్యావో మహామత్ఖానుడ సలామయ్యనీకు
బలేశూరుడని నిన్నుజూచుటకు మరిసచ్చితినిటకు
ఇటువలె బలికిన శేఖుమహమ్మదు నటుజూచియు వేగ
పటుతరమైన వాక్యంబులచే బలికె నపుడు బాగ
ఇంతశూరుడవు యుద్ధానికి నీ వేలవచ్చినావు
వింతలయిన నీమాటల నిట నీ వెందుకు పలికెదవు
అనుచును శేఖుమహమ్మదు నప్పుడు అంత కత్తితోను
తునకలుగా తెగవేసెను యేనుగుతోడ నపుడుగాను
అలసి నిలువగా నీలవేణి యీ మహామత్ఖానుండు
చల్ చల్ అనుచును చూపుమేరలో చెంజజూచినాడు
అని యీ తెలుగున నారదమునివరు డానతియ్యగాను
విని సురనాథుడు విస్మయమందుచు వేగ నిట్టు లనెను
మునినాయక యీమహామత్ఖానుం డెన్నియేండ్లవాడు
ఘనమగుజగడమునందు శూరుడై కడగి నిలచినాడు
పిమ్మట యేమి యొనర్చె దెల్పుము ప్రియముగ మునినాథా
సమ్మతితో విను చెప్పెద నిప్పుడు చయ్యన సురనాథా
మరిపదునెనిమిది యేండ్లవాడయీ మహామత్ఖానుండు
స్థిరముగ యుద్ధము నిదివఱకెన్నడు జేయలేదు వాడు
యెనిమిదివేల గుఱ్ఱంబులను హెచ్చుగాను నటికి
పనిబూనియు వెయ్యేనుంగులను బాగుగాను నటికి
మరలి తనదు హయమును గని వేడుక పౌరుషజన్మమునీడి
పరమముదంబున దేసింగుని గన నరుగుము

వృత్తాంతంబే నొనరఁగ దెల్పెద మెత్తబడఁగ నేల
ఉత్తమాశ్వమా జరుగుమటంచని తత్తరమున చాల
తనరఁగ దెలుపును తిరిగెడు మహమత్ఖానుఁడు వేగమున
మనమున దేసింగుని చూచుటకై పరువిడుసమయమున

{ మహమత్ఖానుఁడు దేసింగుని పద్దికిఁబోగా బంగారునాయఁడు పోనీయక యుద్ధము చేయించుట. }

చూచెను బంగార్నాయఁడు తనదగు సేనలు విచ్చుటను
యీచెడు మహమత్ఖానునివల్లను వచ్చె ననుచు వగను
చేయటువీచుచు గుఱ్ఱపురౌతుల చేర్చి గుంపుగాను
పాయక ముట్టడివేయుఁడు కొట్టుఁడు పట్టుఁడు పరుగునను
అని తనసరదారులకు దెలుపుచును అట్టె తాను వడిని
యినునికై వడిని చురచుర మనుచును మొనసిన బొమముడిని
వేయుచు యేనూర్ గుఱ్ఱపురౌతుల వెలయఁగానుదెచ్చి
ఫయరుఫయరనుచు వారికి బంగార్నాయండుత్తరువిచ్చి
మొనలకు చుట్టును తనగుఱ్ఱంబును మోదంబున ద్రిప్పి
కనుఁగొనిసేనల బారఁగనీయక కాపుజేసి దప్పి
గొనినవారలకు కైపువస్తువులు గోరినట్టు లిచ్చి
మొనలో ధైర్యము విడుచుట తగునా మనకని సెలవిచ్చి
దండనాయకుల గనుఁగొనిపలికెను దాడిచేసి మీరు
కండక్రొవ్వుచే తిరిగెడు మహమత్ఖానుని వడి మీరు
చంపిన మీమీ జీతములెల్లను చాలహెచ్చు జేసి
పంపునటులనే మనవిచేసెద నబాబుతోడ వాసి
మీరఁగ యుద్ధము జేయుండని వారల నెల్లను మెచ్చి
కార్యతంత్రములు మీ రెఱుంగరే కాల్చుఁడు దురమున జొచ్చి

మందుగుండులను కాల్బలంబులకు ముందుగ నిప్పించెను
కొందలనుండఁగ నిబ్బరంబునను కీర్తిగనుం డనెను
అని తను సేనానాయకుఁడగు బంగార్నాయుఁడు కెలుప
మనములరఁగ సేనలు దెలివొందెను మానుషంబు గొలుప
తోటాలెత్తిరి రౌతులందఱును పటుధైర్యంబునను
పటాలనుచును పండ్లగొఱికిరి పౌరుషంబుతోను
తుపాకులలో పోసిరి మందును తురగపురౌతులును
సిపాయిబిడ్డలము మేమని వీరాలాపము లాడుచును
పనియనుగొని గట్టించి తుపాకుల నాయత్తముజేసి
మొనలో సరదారుత్తరవునకై మోపుజేసి నిలచి
ఉండగతంబుర వాగెనుముందర జండా లటువెనక
రెండుక్రోశముల దూరము దెలియఁగ యెత్తిరి బలుకడక
ఫయరుఫయ రనుచు సిగ్నల్ జూపెను పరువడి మేజరును
వొయరొవ్వయ రనుచు యెత్తిరి చెవులను వొయలుమీరఁగాను
పటపటపటపట పటపట యనుచును వడిగా శబ్దములు
చటచటచటచట చటచటయంచును చెలఁగెను మిణుఁగురులు
గుప్పుగుప్పనుచు ధూమం బెసఁగెను ఘోరంబుగ నంతట
చెప్పశక్యమా సురపతి యిప్పుడు తప్పక విను మంతట

మహమత్ ఖానుఁడు రెండవతూరి యుద్ధముఁజేయుటకై కోపము గొనుట.

మహమత్ఖానుఁడు తుపాకిశబ్దముల మట్టెంతని యెంచి
యహ మడంచెదను తురకల నిప్పుడు నది యెంతని మించి
నీలవేణి గుఱ్ఱంబును ద్రిప్పెను నీటుమీరఁగాను
కాలముదీరెను వీరి కనుచును కడుకోపముతోను
బారుతుపాకుల శబ్దము విని యా పౌరుషంపుహయము
వైరులచే దప్పించదలఁచి యా వన్నెమిగులు హయము

ముట్టికాలు తా వేసుక నిలిచెను ముదముమీరఁగాను
పట్టుతుపాకుల గుండ్లరవలు తమ తలపై నెగురగను
లేచెను గుఱ్ఱము నడిచెనుకోపము రెపరెప మనఁగాను
కాచెనురౌతును బ్రోచుకొనెను తను రాచెను కాళ్లటను
నాదౌరయగు మహామత్ఖానుని గొని ముదమున మొనసొచ్చి
కదనంబున నాకడక జూపెనను గాకను మది నెంచి
పొంచెను మించెను బలుయుక్తులు దలంచె నీలవేణి
వంగుచు లేచుచు వ్రాలుచు దుముకుచు వచ్చె నీలవేణి
బిరబిర నడుచుచు నాటలాడుచును బారుదెంచె నపుడు
సురసుర చూచుచు స్రుక్కుచు నిలుచుచు సారిదినడిచె నపుడు
ఇటువలె గుఱ్ఱము నిమిషమాత్రమున పటురయంబుగాను
చటులతరంబుగ నబాబుదండులో నీటుగ జనఁగాను
గుఱ్ఱపురౌతులు తోటాలెత్తుక కొలుకునంతలోనా
పుఱ్ఱెలదరఁగను మహామత్ఖానుఁడు బోరిగొనియెను తన్నా
రౌతులు జూచెడి యంతలోపలను రయముమీరఁగాను
మోతుబరుల పది వేవుర నఱికెను ఖ్యాతిమీరఁగాను
కఱుకు కఱుక్కని శబ్దము వినఁబడు నిరుప్రక్కలయందు
తెఱిగిన కూరాకులవలె ప్రోవులు తలలు బడియె నందు
తలలులేని మొండెంబులు నిలఁబడి తాండవంబులాడు
మొలలూడిన తల లౌడుగఱచుచును మ్రగ్గక నడయాడు
అప్పుడు కత్తిని ఝుళిపించుచును మహామత్ ఖానుండు
కుప్పించుచు తనగుఱ్ఱము వైరుల కొప్పించక మొండు
కోపంబున ఖడ్గంబునువిసరఁగ కూలుజనులు లెక్క
యాపద్మాత్మున కలవియె చెప్పఁగ నాపదాతిస్రుక్క
మహామత్ఖానుఁడు చేసినయుద్ధము మఱిచెప్పెద కొంత

యూహానుబుద్ధికి తోఁచినంతలో హెచ్చుగ వినుమంత
కత్తిచేతఁగొని మహామత్ఖానుఁడు కాలుఁనివలె నిలచి
మొత్తెను మున్నూర్వేల గుఱ్ఱముల మూలమూల లరసి
సుబేదారులను జమేదారులను మేజర్ సుబేదార్ల
బాబువారిగా బిరుదులుగలిగిన బాబుసుబేదార్ల
యేబదియారుమందిని జంపెను యిభములు నేనూరు
కబళం బిచ్చెను తనదుకత్తికిని కసిమసంగి వారు
తుపాకిమొనలను ముమ్మొనదీరిన తోరపుఁగాఁబెలతో
యీపాతకుని పొడిచెద మనుచును వే పరుగిడ నెంతో
కోపముతోడను నీలవేణినపు డాపురుషుఁడు డిగ్గి
యాపదాతులను పదివేవురను యపుడు సమరి యగ్గి
దగిలిన దూదికొండలవడువున ధారుణి గూలఁగను
పగరెట్టింపఁగ పట్టపగటిరవివలె తా మండుచును
యిరుచేతుల కత్తులనుబూని యా పరసైన్యంబులను
పరుగిడ నివ్వక కఱుకు కఱుక్కని వారియంగములను
చిదురుపలై భువి గూలఁగ నేయుచు నీలవేణిఁ జూచి
వదలక నా వెన్నంటి రమ్మనుచు పౌరుషమునుగాంచి
దేసింగుని జూడఁగఁబోవుద మని వానిమీరఁగాను
గాసిజెందకను మనము బయలుగాఁజేసి నిలువఁగాను
చూచెను బంగార్నాయం డప్పుడు శూరవరునిచేత
పూచిన మోదుగచెట్టురీతి తనపోట గ్లుండుటచేత
గనుఁగొని యరవై ఫిరంగీలను పెనుపొందఁగదెచ్చి
వానరగ విడువక కాల్చుండనుచును యుత్తరవులనిచ్చి

మహామత్ఖానుఁడు దేసింగునిజూడబోవుచుండఁగా ఫిరంగీలచే కాల్చుట.

ఈసన్నాహము బంగార్నాయం డేరుపఱచుచుండ

వెననే మహామత్ఖానుండప్పుడు వీరుఁ డగుచు కొండ
పైదీపంబై వెలుగుచునెక్కెను పరగనీలవేణి
నదెపదమన రాజును జూడగ నని కదనముపుడు మాని
శంకరాభరణమను నదియొడ్డున పొంకముతో విడిసి
జంకక మహామత్ఖానుం డనిలో శంకలేక వెలసి
దేసింగుని జూడను గోరుచుబలు తెంపుతో డరాగా
యీసేనను ఘంఢంమనశబ్దము వెనవినఁగను బాగా
ఫిరంగీల శబ్దంబులటంచును పేర్మిని పేటసిపాయీ
తురంగమునుగని దురంబునకు నవసరంబుగను భాయీ
జల్దిగదిరుగుము దండుదిక్కునను సాపుచేసి మనము
యొద్దికజనుద మటంచని దెల్పఁగ తద్దయు నాహాయము

— మహామత్ఖానుఁడు గుండుతగిలి స్వర్గంబున కరుగుట. —

గట్టినిదిరుగ నబాబుదండులో ఫిరంగీకాల్పనట
యెట్టగధమ్మని గుండొక్కటిపడి వీరుఁ రొమ్మునాట
బ్రతుకికలేదని తెలుసుక మహామత్ఖానుండటు వేగ
పతినిగనుట పూజ్యం బీతనువుతో మదినికగుండుట బాగ
అనుచును గుండు తగిలిన రంధ్రమునందు గుడ్డలను దూరిమి
కనుఁగవ కెంపులు చెదర నప్పుడు కనలుచు హాయమును తరిమి
చంపె నయిదునూ ర్వేలరౌతులను సంకోచింపకను
బొంపిరి బోవని ధీరశౌర్యముల బారిసమరె సటను
గుఱ్ఱంబులు యేనూఁట మడిసె నా గురిపోటరి చేత
మిఱ్ఱుపల్లములు సమంబులాయెనా మెదడు ప్రోవుచేత
ఈరీతిగ నొకగడియలోపల ననేక ప్రజలనటికి
ఏరుఁడు జీవము విడువఁదలఁచి తా వెనగుఱ్ఱమును నటికి

పశ్చిమాభిముఖుఁడై కూర్చుండెను పాశంబుల నడఁచి
నిశ్చలముగ మది తనదైవంబును నిలిపి మోహమడఁచి
చేరెద దేవునిసన్నిధానమని శీఘ్రము కన్నులుమూసి
పారెడిమనమును పట్టినిలిపి తగు భ్రద్రంబటుజేసి
కురానులోగల కొన్నివాక్యముల ఘోషింపుచునుశివి
కరుణాకర నీపదముజేర్చుము కాలమాయెనని పనివి
అల్లారే అల్లారే యనియుతం డల్లననప్పుడును
తల్లడమున దేసింగుఁడు గుందగ తాజనె స్వర్గమునకును
అంతట అలరులు గురిసిరిసురలు అతిమోదముతోను
వింతవిమానము వచ్చినిలిచెనా వీరునిగొనిపోను
నత్తఱిదివ్యంబగు నొకతేజము నతనితనువువెడలి
తత్తరమందుచు ప్రజలజూడగను తగ్లైవిమానంబడలి

-- నబాబు మహమత్ఖానుని గుఱ్ఱమును పట్టుకరమ్మనుట. --

మహమత్ఖానుఁడు పడిననబాబు మదిలోహర్షించి
సహజంబుగ నాబంగార్నాయని చయ్యన నటజూచి
బంగార్నాయఁడ మహమత్ఖానుఁడు మరినీల్గెనునేఁడు
శృంగారంబగు నీలవేణిని సొంపుతోడయిపుడు
పట్టుకరమ్మీ వేగమెపొమ్మీ బంగార్నాయఁడా
పట్టుపడునో పడదోమనకిప్పుడు బంగార్నాయఁడా
మూడువేల గుఱ్ఱంబుల దీసుక మోహరంబుగాను
గాఢంబుగ గుఱ్ఱమునుపట్టుకొని గ్రక్కునరమ్మనెను
వేగమె బంగార్నాయఁడు నాలుగువేలగుఱ్ఱములతో
తెగువతో నీలవేణినిబట్టుక జాగ్రతగానెంతో
పోయిచూడఁగను నీలవేణియును పొందుగ నచ్చటను

పాయనిశౌర్యము తోడగుఱ్ఱముల పరువడి జూచియును
కనలుచు గర్జన జేయుచు నెగరుచు కడువడి దిరుగుచును
తనబలమున గుఱ్ఱంబుల నెల్లను తన్నుచు కఱచుచును
గిరగిర దిరుగుచు బరువిడి దుముకుచు కినిసియు నాడుచును
చొరబడి గుఱ్ఱపుగుంపులో దూఱుచు మరిమరి చంపుచును
కమ్మినకాల్బలముల నెల్లను తన కాళ్లతో తన్నఁగను
దుమ్ములు యెగరగ గుఱ్ఱపు గుంపులు తుత్తుమురులుగాను
మిట్టుగ నిలచిన గుఱ్ఱంబులను మెడలనపుడు కొఱికెగా
విఱ్ఱవీగి వచ్చినగుఱ్ఱంబుల వేగముగా నుఱికెగా
అంతట నాలుగు వేలగుఱ్ఱంబుల వింతచావుజూచి
చింతతో బంగార్నాయఁడు దొరతో చెప్ప వెసనువచ్చి
కనిగుఱ్ఱము మనకలవిగాదని మనమున నెన్నుచును
ఘనుఁడగు మహామత్ఖానుని కేసరి గాక యున్నయెడను
ఇటులొనరింపఁగ నెవ్వనిచేనగు తటుకున చూడఁగను
కటకట యేమనవచ్చు పదీని పటిమయుటంచనను

——దేసింగు నీలవేణి చచ్చుటజూచి వ్యసనము నొందుట.——

నీలవేణియును వ్యసనముచేతను నిలిచిచూచి వగచి
చాలదుఃఖముతో రాజువద్దికిని చక్కరాగజూచి
యేమిచేసితివి మహామత్ఖానుని యిపుడు నీలవేణి
యేమాయెను నాప్రాణసఖుం డత డిపుడు నీలవేణి
యెచ్చట మహామత్ ఖానుఁడు బడ్డా డదియు జూపుమనిన
నచ్చటికిని యానీలవేణియును అరయగ రమ్మనిన
పోయిశీఘ్రముగ మహామత్ఖానుని పొగలుచు తామించి
పోయె పోయెనా ప్రాణసఖుండని పొగడియు నటుగాంచి

వాసిగ నప్పుడు దేసింగుఁడు బల్ వ్యసనముతోడుతను
యీసున నీసునే విడిచి యొంటిగా నెటుల నుందునేను
నీవు ముందు జని నాకొకజాగా నేరు పరచవయ్యా
సావకాశ మికలేదు నబాబును చంపినత్తునయ్యా
అనుచును గుందుచు నిట్టటు బడుచును నిలబడి పొగ్గుచును
కనుఁగొని యేడ్చుచు కన్నులుమూయుచు కడువ్యసనముతోను
మహామత్ఖానుకు గోరీయచ్చట మరియు కట్టుటకును
బహుళా పల్లము త్రొవ్వించెను నా పట్టున చయ్యనను
పల్లములోనా మహామత్ఖానుని పట్టియుంచఁగాను
యెల్లవారలును జూచుచుండఁగా నెంతో తెగువతోను
వచ్చియు గుంట చట్టు చుట్టుచును వడిగ నీలవేణి
యచ్చట నిలబడి కన్నీరుంచెను నంత నీలవేణి
కనుఁగొని యప్పుడు దేసింగుఁడు తా ఘనశోకముతోను
మనమున గుందుచు నీలవేణిని మహామత్ఖానునితోను
పనుపుట లెస్సని ఖర్గము గొని తా పరగ నతికి యంతా
ఘనమగు జేజిని పల్లంబునను కడఁగిచేర్చి కొంతా
గోదానంబులు భూదానంబులు కోటిస్వర్ణములును
భూదేవతలకు సంతోషంబుగ పొందుగ నిచ్చియును

—దేసింగుమహారాజు నబాబుతో యుద్ధము చేయుట.—

తప్పక దేసింగుఁడును తనజమేదారుల నటుజూచి
యిప్పుడు పల్కెను నన్నలార మీారందఱు విన మించి
మహామత్ఖానునితో సగబలమును మఱిదగ్గెను నాకు
సహజంబుగ నాకేమిబలమును చయ్యన లేదిటను
చయ్యన నిప్పుడు నాబలంబుతో జేరి దండులోను

వాయ్యానజొచ్చి నబాబునుపట్టి నేనును చంపెదను
జాగ్రతతోడను రండు మీరలును జమేదారులారా
ఆగ్రహంబునను వండునమీరును జమేదారులారా
చొరబడి శూరుల పట్టిచంపుడు గరిమెతో వారలను
సఱుకుఁడు యేనుఁగు గుఱ్ఱములను నుఱి యతిధైర్యంబుగను
పరుగిడువారల పరువిడిమీరలు పట్టవలదుసుమ్మీ
జరిగిన వారల జడిసిన వారల చంపవలదు సుమ్మీ
యేమరియుండిన వారలమీరలు నెదిరించగవలదు
మైమఱచియు లాహిరిచేనుండిన వారిజంపవలదు
అనుచును దేసింగుఁడు తనబారాహజారి నటుజూచి
ఘనముగ పంచ్రెండంకెమ్ములుగల ఘనతేజిని గాంచి
చెలువుతో నెక్కి మీసముదీటి చేతకత్తిబట్టి
చల్ చల్ బాబా యని నడిపించెను గుఱ్ఱము చేదట్టి
సింగమువలె గర్జనజేసెను దేసింగుం డంతటను
రంగుగ పులివలె రొప్పెనపుడు దేసింగుం డంతటను
నబాబు కనుఁగొని బంగార్నాయని నంతలోన బిలచి
దబాలు వరుసగా ఫిరంగీలను తయారు జేయించి
మనదండెల్లను నొక్కచోటను మరిమోహరముగను
ఘనముగ బెట్టుము బంగార్నాయఁడ గ్రక్కున నిప్పుడును
శూరుఁడయిన దేసింగుఁడు వచ్చెను జూడు మిపుడువాని
బారహజారి నెక్కుకవచ్చెను బరువడినిటవూని
అటులనుండిన దేసింగుండును యాదండులో జొచ్చి
పటుతరంబుగను చిమటా యిచ్చెను బారహజారిని మెచ్చి
యిటుల హజారిని చిమటాయిచ్చిన పటపట పటయనుచు
పటుతరముగ నిటువచ్చిన గనుఁగొని వరుస ఫిరంగీలిడుచు

ఒక్కపలీతా ఢాంఢా మనుచును యక్కడకాల్చఁగను
చక్కఁగవచ్చియు గుండుసందులో గ్రక్కునదూరగను
బారహజారి తోఁచను వాగలో బడిపడిదూఱుచును
మార్ మార్ మారని దేసింగుఁడువడి జేరినఱికఁగాను

## దేసింగుఁడు దావుత్ ఖానునితో పోరుట.

చేతిపట్టు దావుత్ ఖానుఁడు చెచ్చెర జొచ్చియును
ఘాత వేయుచును పెద్దఫిరంగుల కడువడి కాల్చుచును
నంత రేకలాఫిరంగీలను గొంతకాల్చిరపుడు
సంతవెనక యేనార్ గుఱ్ఱంబుల నమరబంపినాఁడు
మందు పోటుకును గుండు పోటుకును సందేహించకను
సందునబడి దూఱుచు పై కెగురును సరగున హయములను
గిరగిర ద్రిప్పుచు నెగర వేయుచును కరకరి సేయుచును
పరగున దండు తండంబుల సవ్యాపసవ్యములుగాను
తఱుముచు నఱికెను దేసింగుండును కఱుకు కఱుకు మనుచు
మరి గుఱ్ఱంబుల తుండ్లు తుండ్లుగా నఱికి నఱికి వైచు
అరటి కంబముల నఱికిన కరణిని యంత దండునెల్ల
సొరకాయల తెగనఱికిన కరణిని సొరది సేనలెల్ల
జొన్నదంట్లు తెగవేసినతీరున చొరబడి దండునను
వున్నవారి నటుచాపకట్టుగా నుక్కడంచుచును
ఇటుల జేయగా దావుత్ఖానుఁడు చటులకోపమునను
పటుతరమగు పదివేలఫిరంగుల పదిలపఱచి యటను
ఒక్క పలీతా తీర్చినాడయా వుద్దండంబుగను
చక్కఁగ పెట్ పెట్ పెటాలనుచును శబ్దంబులతోను
వచ్చెడిగుండుకు పైకి నెగసెను వొప్పుగ గుఱ్ఱమును

అచ్చటి పొగకును పైకినెగసెను చెచ్చెర గుఱ్ఱమును
చిక్కినవారిని గ్రక్కునమోరెను పెక్కు విధంబులను
నెక్కడజూచిన దేసింగునివలె నెక్కడ నుండఁగను
మరుగు జేరుచును పరుగులెత్తుచును తిరిగిచూచుకొనుచు
విరిగిన దండును దావుత్ఖానుఁడు వెనను జూచి వగచు
దండునెల్ల నొకచోటనునిల్పి ఖండితంబుగాను
మెండుగ ముప్పది వేలతుపాకుల మేటిశబ్దములను
ఒక్క ఫలీతా తీర్చిన గుండ్లను వెక్కసంబుగాను
పెక్కు విధములై మండెడి మంటలో పేర్చియు గుఱ్ఱమును
యెగిరిదాఁటుచును పొగలో దూఱుచు యిటునటు దిరుగఁగను
దిగువ బడిరి యానబాబు దండు తెరలు మంటలోను
వేయు గుఱ్ఱములు నొక్కసారిగా వేగరాగజూచి
నాయెడ బారా హజారిదాఁటెను సంతెదానిఖించి
ఒక్కక త్రిపై వెయ్యికత్తులు వొక్కసారి రాగా
వెక్కసంబులేకను దేసింగుఁడు విరిచె నన్ని వేగా
చాలఁగ దావుత్ఖానుండును పదివేలగుఱ్ఱములను
మేలగురౌతులతోడను బంపెను మిక్కుటంబుగాను
వచ్చినగుఱ్ఱంబుల దేసింగుఁడు వరుసగాను జూచి
యిచ్చెను చిరుటా బారహజారికి యెసపు కాలిమించి
పటపటపట యని ధవుడాయించెను బారహజారియును
చటులకోపమున దేసింగుండును దావుత్ఖానుఁడును
యెదురుగ బారాహజారిద్రిప్పెను హెచ్చుశౌర్యమునను
అది గనుఁగొని యాదావుత్ఖానుఁడు మదపుటేనుఁగులను

దావుత్ఖానుఁడు మదపుటేనుంగులసమూహములను దేసింగునిపైఁ గదియ బంపుట.

అఱువదివేల మూవటీలతో నెచ్చుగాను వచ్చి
నరగున తొండంబున రోకంఢ్లను చక్కగాను దాల్చి
విసరుచువచ్చెను నలుదిక్కులను వెసను జనులు బెదర
విసరుచువచ్చి దేసింగునిపై క్రమ్మికొండ లదర
ఘీంకారింపుచు తొండములెత్తుచు గిరగిరదిరుగుచును
శంకలేక రోకంఢ్లను ద్రిప్పుచు చాలఁగ వచ్చినను
చూచి యప్పుడు దేసింగుండును చోద్యం బందుచును
యోచింపక నాయేనుఁగగుంపులో నొప్పుగ గుఱ్ఱమును
కదిలిచి కనలుచు తా వడి జొచ్చి కడునుగ్రుం డగుచు
పదిలముగా తనచేతను బాలా పట్టి విజృంభించు
తొండంబుల నెల్లను వడినఱికెను తుండ్లు తుండ్లుగాను
గండస్థలముల గ్రుచ్చియెత్తెను కండలురాలఁగను
మొండెములుగ తెగనఱికెను యాబల్తండంబుల నెల్ల
మెండుగ నెత్తురుయేరై పాఱెను మేటిదండునల్ల
నరువడి కుంభస్థలములు పొడిపొడియై బడె నప్పుడు కొన్ని
నఱికినంతలో రెండుతుండ్లుగా నటగూలెను కొన్ని
కాళ్లుచేతులు తోకలు విరిగి కదసి కూలె కొన్ని
వొళ్లెల్లను చిల్లులపోటులుబడి వొరిగె నంత కొన్ని
పేగులుకండలు వేరువేరులై మూఁగి గూలె కొన్ని
నాగిలఁబడి పొర్లింతలుబెట్టెను చయ్యన నట కొన్ని
ఆరీతిని తార్ తార్ తార్ జేసెను అప్పుడు దేసింగు
బారహజారికి చిమటాయిచ్చెను బరువడి దేసింగు
దావుత్ఖానుం డుండెడుతావుకు తడయక ద్రిప్పగను

దోవలేక యాపీనుఁగుపెంటలఁ ద్రొక్కుచు నంతటను
యేనుఁగుపై నంభారిలో దావుల్ఖాను నంత జూచి
మానక దేసింగుండును చిపటా బారహాజారికి నిచ్చి
యెడమకాలికి నివ్వగ నప్పుడు యెగిరియు దుముకుచును
తడయక దావుల్ఖానుని యేనుఁగ దగ్గర నిలువఁగను
చెలరేఁగియు తన బారహాజారిని చేత తట్టఁగాను
నిలచి ముందరి కాళ్లను యేనుఁగ నెత్తిన పెట్టగను
కడుకోపముతో మావటివానిని కదసి చేతఁబట్టి
వడిగలకత్తిని ఝుళింపిం చప్పుడు వానితలను గొట్టి
ఉగ్రుఁడగుచు యాదావుల్ఖానుని వొడిసి పట్టఁగాను
నిగ్రహింపలేకను దేసింగుని నెనసి పొగడుచుకును

—{ దావుల్ఖానుఁడు చంగపుబదని వేఁడుకొనగా దేసింగు నబాబు వీఁడే యని నిశ్చయించి యమపురి కనుపుట. }—

అప్పుడు మనమున నిశ్చయించి వో యన్నా దేసింగు
తప్పక నే నీకాళ్లకుమ్రొక్కెద దనరఁగ దేసింగు
విడిచి పెట్టినను పరువైతేనను వేగమె దేసింగు
బడే నూపుఁపవు దయ నన్నేలుము బాలుఁడ దేసింగు
అనవిని దేసింగుఁడు దావుల్ఖానుని వేగమె జూచి
ఘనుఁడగు నబాబు వీఁడె యనుచును కడుఁ నీ మదినెంచి
బాలావేసిన దావుల్ఖానుఁడు బడి నీలిగెనపుడు
చాలఁగ నబాబు దండులో నందఱు సరగ బాఱిరపుడు
కొందఱు బాఱుచు నేలఁగూలుచును కొందఱు మందుచును
కొందఱు దాఁగుచు తిరిగిచూచుచును కొందఱు వగచుచు
నబాబు కొండఱు నందునదాగెను నతిభయ మొదవఁగను

నబాబు సేనలు పటాపంచలై నటచెడి భాఱంగను
తత్తఱపడి పరుగెత్తువారి పై కత్తియెత్తరాదు
సత్తలేక నిలచినవారలపై కత్తియెత్తరాదు
యిరువదియాఱువత్సరములవాఁడిప్పుడు దేసింగు
సరగున యాభై వేలగుఱ్ఱముల జంపెను దేసింగు
రెండు వేలయేనుంగులగుంపును దండిగ దేసింగు
మెండు సేనలను జంపె నప్పుడు మేటిగ దేసింగు
యిరువదినాలుగు ఝుండాలన్నియు బరువడి దేసింగు
సరగున పెటపెట ద్రుంచివేసెను చయ్యన దేసింగు
అప్పుడు దేసింగుఁడు చెయ్యలసి నపుడు తాను నిలచి
యొప్పుగ నెత్తురు గాలువుడుపులను కప్పినంత జూచి

దేసింగు దావుత్ఖానునిజంపి శంకరాభరణనదిగట్టున గూర్చుండుట.

ఇంకనేల యానబాబు చచ్చెను శంకలేక నేను
శంకరాభరణ నదిలోపలనే స్నానము జేశటను
పోయెద ననుచును నయిదుగుఱ్ఱముల పొందుగానుగూడి
ఆయెడ బారాహజారి నెక్కియు నంత నచటజేరి
వచ్చి శంకరాభరణముగట్టున వదలక తానిలచి
అచ్చట బారాహజారి డిగ్గి యంత నీళ్లజొచ్చి
ఉడుపులగడుగుక కత్తినికడిగెను నొప్పుగ దేసింగు
బడలిక దీరఁగ స్నానముజేసెను బాలుఁడు దేసింగు
మూడుదోసిలి నీళ్లనుద్రాగెను మురియుచు దేసింగు
నీడను జేరి కూర్చునె నప్పుడు నిజముగ దేసింగు
సహాజము నబాబును చంపితిమనుచును సంతోషించుచును
మహామత్ఖానుఁడు పోయె ననుచును మరిమదిగుందుచును

{ ధనసింగుఁ పనుదాయాది దేసింగునివద్దికివచ్చి నబాబు నీచే జావలేదని తెలుపుట. }

యిటులనున్న దేసింగునివద్దికి తటుకున నప్పుడును
పటుతరముగ ధనసింగుఁడువచ్చి పల్కె నతనితోను
రాంరాం సీతారాంరాం రాంరాం రాజా దేసింగు
రాంరాంరామనె బదులుకు నప్పుడు రాజా దేసింగు
సరగున వచ్చిన పనియేమిర నాసామీ దేసింగు
యిరువుగ యుద్ధము విడచివచ్చితే మిప్పుడు దేసింగు
ఆమాటలువిని దేసింగుఁడు తా నప్పుడు నిట్లనెను
యేమియున్న దిఁక నబాబుచచ్చెను యింక యుద్ధమునను
ధనసింగుఁడు నామాటలువిని తత్తఱపడి యిట్లనెను
దనరగ నీచేఁజచ్చినవాఁడును దావుత్ఖానుఁడును
సగముబలముపోయి నతనిగుందుచు సంకటమందుచును
నగచెడి యుద్ధము చేయలేమికని పొగలిన బొంబటను
కొండలసందున సాదుల్లానుఁడు కోరిదాగినాఁడు
దండెల్లను నీదాండికోర్వకను దాగియున్న విపుడు
శత్రుశేష మింతయినను నిల్వగ జనదిక దేసింగు
మిత్రుఁడవని నే నీకు దెలిపితిని మేలగు దేసింగు
జల్దీజల్దీ బయల్దేరుమీ జలిదిగ దేసింగు
వలదు నిలపగను నబాబుకూల్చుము జలిదిగ దేసింగు

{ రంగనాథుఁడు దేసింగు యుద్ధమున కుద్యుక్తుఁడై నంతట బోవలదని బుద్ధులు గఱపుట. }

అతనిమాటలు విని తా నలరుచు నంతట దేసింగు
మితిమీరిన సంతసమున బొదులుచు మీరెను దేసింగు

బారహాజారిని దగ్గిర తెమ్మనె బరువడి దేసింగు
శూరత్వంబున కత్తినిబట్టెను సొంపుగ దేసింగు
నారాయణ శౌరీ యని యెక్కెను బారహాజారిపైని
ధీరుం డాగ్గురుసరదారులతో తెంపున గూడుకొని
వెడలఁగ తనపాలిటిరంగేశుఁడు వెనక నిలువఁగాను
కడువడి దేసింగుఁడు రంగేశుని కనులపండువుగను
కనుఁగొని శ్రీహరిపాదపద్మముల కప్పుడు మ్రొక్కుచును
నినునమ్మితి శ్రీరంగనాయకా నన్ను విడుచుటకును
పనిగాదుర యీసమయంబునను పరగ రంగనాథా
అనువుగ నన్నేలక తొలంగినను నపయశస్సుగాదా
అని పలికిన శ్రీకస్తురిరంగం డతని జూచి మెచ్చి
వినరా యుద్ధము యీదినమందున వేడ్కతోడ జేసి
బహుప్రయాసపడి యలసినవాఁడవు బాలుఁడ దేసింగు
సహజంబుగ రేపటికిని జయమగు చయ్యన దేసింగు
బాలుండవు నామాటలు విను మిక బరువడి దేసింగు
చాలుచాలు యీదినమున యుద్ధము చాలుర దేసింగు
మూడుమ్ముక్కాల్గడియవరకు నే ముదమునొదవఁగాను
తోడుగనుంటిని యీదినంబు నిను కూడ నింక నేను
నీకు సహాయము గాను రేపటికి నిశ్చయంబుగాను
ప్రాకటముగ నే బోయివత్తు నాపల్కులు విను మనెను
ఘనమగు తనశూరత్వము దెలియఁగ కనలుచు రంగనితోను
మొనగాఁ డగు దేసింగు రంగని గనుఁగొని యిట్లనెను
ప్రేమతో మీదయ యీగతి నుండఁగ నేమి కొదవ యిఁకను
స్వామీ నామాటలువిను మిప్పుడు సరగున జెప్పెదను
చయ్యన యుద్ధములోన నబాబును చంపెద నదియొకటి
యయ్యెడ నాతనిచేత ససువులును నొయ్య విడుచు టొకటి

ఆరునూరులో చావులు దప్పదు యది నిశ్చయమయ్యా
ధీరులయినవారికి ప్రాణముపై దృష్టికలుగదయ్యా
దండులోన జయమొందగ నీకృప దయసేయగదయ్యా
దండున నీల్గినవారికి నీదగు దం డండగదయ్యా

—— దేసింగుఁడు రెండవతూరి యుద్ధమునకుఁ బోవుట. ——

పోయివత్తునని బారహాజారిని పొందుగ నెక్కుకొని
పాయక నెడమకాలికి చిమటూ పరగ నివ్వ వడిని
పటపటపటయని ధవుడాయించెను బారహాజారియును
తటుకున దండు నుండుతావునకు దగ్గిర బోవఁగను
ఉండు నబాబు దండులోవారును వొప్పుగాను నపుడు
దండియైన దేసింగుఁడు వూరికి తాను పోయినాఁడు
యింకమీాద మన కంపఅకును సిపు డేమి భయం బనుచు
శంక లేక మనవూరికి బోదము చయ్యన రం డనుచు
అంత నబాబును గూడి గుంపుగా నచట నుండఁగాను
చెంతకువచ్చిన యాదేసింగుని సరగ నబాబటను
చూచి సింహమును గన్నను దేభము చొప్పున వడఁకుచును
ఆచెంతను పులిగన్న లేడివలె యట్టిటు బెదరుచును
పిల్లినిగన్న చిలుకచందమున బెదరుగ జూచుచును
వల్లదప్పి వలలోఁబడినట్టి వనమృగంబువలెను
అదరిపడుచు నట్టిట్టుజూచుచు పెదవులు దడుపుచును
యిదెవచ్చెను దేసింగుఁడు నిఁక నే నేమిసేతునవెను

—— { నబాబు తోండ్రమల్లునిబిలిచి దేసింగునికడకు సమాధానమునకు సంధికంపుట. } ——

గడగడవడఁకుచు తోండ్రమల్లుని వడిగ నపుడు బిలచి
తడయక బల్కెను నబాబప్పుడు తప్ప కతని జూచి
తొందరగలిగెను యేమిసేతునో తోండ్రమల్లన్న

ముందుగ నాప్రాణములు గాచుటకు ముఖ్యుఁడ వీవన్న
అనిన నబాబుతో తోండ్రమల్లుఁడు నప్పు డిట్లు ననియెన్
పనియేమిక సెలవియ్యుం డన్న నబా బతనితో ననియెన్
దేసింగుఁడు మనదండుల నెల్లను తెగువతో ఛేదించి
భాసురముగ వాఁడూరికేగె నని భయమువిడిచి మించి
ఉంటినియిదె దేసింగుఁడు వచ్చెను వొప్పుగాను వాని
కంటజూచుటకు భయముగనున్నది గట్టిగ నామదిని
ఒక్క కార్య మున్నది నేనిప్పుడు నొప్పుగ చెప్పెదను
చక్కఁగాను నీ వతనికి నాకును సంధిసేయవలెను
దొరతనమును నీ కిచ్చెదననుచును తోండ్రమల్లోజీ
నరగునార్కా డ్వేడ్క నేలుదును చయ్యనమల్లోజీ
పట్టముకట్టించెద నని యతనితో బలుకుము నీవన్న
పట్టుగ నాయార్కాడు నీదియని పలుకుము నీవన్న
నేనుబంటుగా నతని గొలుతునని నిజముగ పలుకన్న
మానక నేనీ దాసుఁడననుచును మరిమరిపలుకన్న
యిటులనబాబు తోండ్రమల్లులతో పటుతరంబుగాను
తటుకున దెలుపఁగ మది భయంబుగొని తడబడి లేచియును
సలాముచేసి తోండ్రమల్లుఁడు చయ్యన నిటువచ్చి
బలేశూరుఁడగు దేసింగునికి మరి యెదురుగవచ్చి

తోండ్రమల్లోజి దేసింగునికి సంధిజేయుట.

రాంరాంరాంరాంరాంరాంరాంరాంరాజా దేసింగు
రాంరాంరామనె బదులుకు నప్పుడు రాజగు దేసింగు
భయముజెంది నేవచ్చినానయా బాలుఁడ దేసింగు
దయతోడుత నామనవివినుమయా తడయక దేసింగు
చెలువుమీరఁగా నబాబుమీతో సంధిసేయుమనెను
చలము సేయకను వినుఁడు జెప్పెదను సవిస్తరంబుగను

దొరతనమును నీకిచ్చెద నేను బరువడి దేసింగు
సరగున నాతాక్కడ్వేడ్క నేలుమనె స్థిరముగ దేసింగు
పట్టమునీకే కట్టెదననుచును పలికెను దేసింగు
పట్టుగ రాజ్యము నిన్నేలగమనె బాలుఁడ దేసింగు
నీకు బంటనై నేనుండెదననె నిజముగ దేసింగు
జోకతోడనీ దాసుఁడనేననె సొంపుగ దేసింగు
యిటుల నబాబు సెప్పి పంపెను యిప్పుడు దేసింగు
పటుతరముగ శ్రీరామువాక్యముగ బలికెను దేసింగు

## { దేసింగు తోండ్రమల్లోజితో యుద్ధము జేయుటే యుక్తమనుట. }

అన్ననప్పుడా తోండ్రమల్లుగని యంతనుగ్రుఁడగుచు
కన్నులెఱ్ఱఁగను జేయుచు పలికెను ఘనకోపుం డగుచు
మరియీామాటలు యేలను తోండ్రమల్లోజిప్పుడును
బరువడి యుద్ధముఖంబునబలికెడు పలుకులె యివి యనెను
నాఁడు నీవిటుల సంధికివచ్చిన నప్పుడు వొప్పుదును
నేడిటు పలికిన నాటిబీరములు నేయుడవిని జనెను
దనరనబాబుకు హితుఁడగుదావుత్ఖానుఁడు పోవుటను
ఘనుఁడగు నా స్నేహితుఁడగు మహమత్ ఖానుఁడు నీల్గుటను
ఇద్దఱుశూరులు తెగినవెనకమా కింకమాటలేల
యుద్ధము జేసియు మాబలంబులతో నొప్పుగ నీవేళ
జూపఁగవలయును గాకయింకయీా సంధియేటికనెను
సాపుజేయవలె దండులో తెగబడి చయ్యన నిప్పుడును
శూరులయిన తురకలు మీారింత యధైర్యపడఁగనేల
పేరుఁడయిన నబాబుకిప్పుడు వేరెమాట లేల
పకపకనవ్వుచు దేసింగుం డిటు పలికి యతనితోను
యిక నొకటున్నది తోండ్రమల్లు నే నిప్పుడె జెప్పెదను

చెలఁగినబాబుకు బలముగలిగితే చెంజినేలుమనుము
బలము నాకు గలిగిన నార్కాడు ప్రబలముగ నేలెదను
యీవిధములుగా కిప్పుడు వేరే యేమిలేదు వినుము
నావిధమంతయు మీానబాబుతో నరయబలుకు పొమ్ము
జల్ది జల్ది మీానబాబు నిప్పుడు జలిదిగ రమ్మనుము
జల్దిగ నేనిదో వచ్చెద నీవును జలిదిగానుపొమ్ము
మరి మరి సలాము జేసియు తోంద్రమల్లుం డప్పుడును
తిరిగి నబాబుకు విశదంబుగ నీ తెఱఁగెఱిఁగించఁగను
అదరిపడియు బంగార్నాయని తా నంతలోన జూచి
పెదవులు దడుపుచు పలికె నప్పుడు పెంపుదప్పి లేచి
యేమిసేయుదును బంగార్నాయఁడ యేమితోచలేదు
యేమిచేసినను నీదేభారము యేమర కికమీాఁదు

{ బంగారునాయఁడు దేసింగునిమీాదికి వేంకట్రావును సేనాసమూహాముతో యుద్ధమునకుఁ బంపుట. }

అన విని బంగార్నాయం డప్పుడు అతిధైర్యంబునను
ఘనుఁడగు వేంకట్రావును జూచి కడువేగంబునను
శంకలేక యేనూర్ గుఱ్ఱములను వేంకట్రాయుఁడా
యింక తీసికొని రమ్మిటు జలిదిగ వేంకట్రాయుఁడా
దేసింగునికిని యెదురుగబొమ్ము తెగువతోడ నిపుడు
వాసిమీారఁగను యుద్ధముచేయను వదలక జను నేఁడు
సరగున యబ్దుల్ ఖాదరుఖానుసాయబు దండునను
బరువడి కొలుముత్ఖానుఁడు నీకు మరిసహాయముగను
వచ్చెద రిప్పుడు వేగమె బొమ్ము వారిగూడి యనిన
నచ్చట నందఱు దండుగూర్చుకొని వచ్చి నిలచియున్న
దేసింగుం డటు బారహజారిని తెగువతో నెక్కుకొని

చాలగ రెండు తుండ్లుగనఱికెను సరగ కత్తిబూని
కళ్లకురంజి ఖానుసాయబును ఖండతుండ్లు చేసి
కళ్లికోటయేల్ కొలుముత్ఖానుని కత్తితో తలకోసి
మధురయేలు మళయాళపువానిని మరితలలగనఱికి
యదలించియు వీగుల నటదోలి యావలికిని యురికి
సరగ నబా బటుయున్నపాళెమును చక్కఁగాను జూచి
త్వరలో చిమటా బారహాజారికి మరియిచ్చియు మించి
ధగధగమెఱసెడి కత్తిచేతను తానటు ఝుళిపించి
నిగనిగమెఱసెడి బాలా చేతను నేర్పుగ ధరియించి
యేనుఁగుపై నున్నట్టినబాబును తానంతట జూచి
పూనిక బారహాజారికి చిమటా పొందుగాను యిచ్చి
సందున బారాహాజారి యప్పుడు నతిధైర్యంబుగను
ముందరికాళ్లటు యేనుఁగుతలపై తోప్పుగ పెట్టఁగను
అప్పుడు దేసింగుఁడు తనచేతను అంత కత్తిబట్టి
తప్పుకమాష్టీకుని చెయిబట్టి తలతెగబడఁగొట్టి

నబాబు దేసింగుని తన్ను విడిచిపెట్టుమని వేఁడుకొనుట.

బాలాచేతను ధరియించినయా నబా బతనిచూచి
చాలఁగ దేసింగునితో ననెను మేలుపొగడ దలఁచి
యుద్ధముచేయగ నేరాలేదు వొప్పుగ దేసింగు
యిద్ధరలో నీసమానులెవ్వరు యిప్పుడు దేసింగు
నారాజ్యము నీకిచ్చెదనయ్యా నన్నువిడువు మయ్యా
ధీరత్వంబున యార్కాడిప్పుడు జేరి యేలుమయ్యా
ఒక్కకొళ్ల కేనూరుకొళ్లలు వొప్పుగ నిచ్చెదను
ఒక్కచెరకు నేనూరుచెరలును వొనరఁగ నిచ్చెదను
సీమామూలము నీకునిచ్చెదను స్థిరముగ దేసింగు

మామూల్ శాసనమును నీకిచ్చెద మఱిమఱి దేసింగు
నామీఁదనుదయ చాలా వుంచుము అయ్యా దేసింగు
నీమీఁదను యుద్ధానికి రాలే దిప్పుడు దేసింగు
నన్నువిడిచితే పారిపోయెద నప్పా దేసింగు
చిన్నవాండ్లను విడిచివచ్చితిని చెలువుగ దేసింగు
సలాంజేసెదను నన్నువిడువుము చయ్యన దేసింగు
బలేశూరుఁడవు నిన్ను మెచ్చితిని బరువడి దేసింగు
నిజముగ నాపాలల్లాసామివి నీవే దేసింగు
గజిబిజియాయెను నాప్రాణములు కనుఁగొన దేసింగు

దేసింగుఁడు నబాబుతో యుద్ధము జేయుట.

వెలవెలబోయి నబాబప్పుడు వేమరు పల్కఁగను
చెలువుతోడ యానబాబు గనుఁగొని కలకలనవ్వుచును
సంధిచేయుటలు నాడేయుండెను సాదుల్ఖానుండా
యెందుకు యిన్నిమాట లాడెదవు యిచ్చట నాతోడా
మొదట తోండ్రమల్లోజితొ చెప్పిన మాటలు మరచితివో
యెదుటనిలువ నను దేసింగుండని యిప్పుడు నెంచితివో—నీకు
నూటయెనిమిది పాళాల్ పైకం బొప్పుగ నుండఁగను
ఘాటిగచెంజీ రూకలులేకను తక్కువాయెనటను
నీకు బలంబులు జమేదారులు నిజముగ నుండఁగను
యీకాలఁదిని బలుకఁగఁ దగునా నీవిప్పుడు చులకఁగను
చెంజిపైకము తీసుకొనుము నాచేతికత్తి మొనను
రంజితంబుగా రూకలుజూడుము రయముగ బాలామొనను
పట్టుపట్టు రూకలుయిదెవచ్చెను పట్టుమనుచునతఁడు
దిట్టముగా తనచేతనుబాలా పట్టియెత్తియపుడు
తలమీఁదికి యిదొబాలావచ్చెను తప్పించుకొనుము

చెలువుతోక త్తి మెడకువచ్చెను తలగకయిటునిలుము
కనిసీనీవు నాతోనికనైనను గెలువుసమరమునను
అని దేసింగుఁడు పలుకుచునుండఁగ నానమయంబునను

{ ఏనుఁగకడుపుక్రిందగట్టిన తొట్టినుండుమాష్టీ
కుఁడు గుఱ్ఱపు వెనకటి కాళ్లు తెగవేయుట. }

ఘనమగు యేనుఁగక్రిందితొట్టిలో గలమాష్టీకుఁడును
కనుఁగొని గుఱ్ఱము వెనకకా లొకటి క త్తితోనఱకఁగను
తెగవేయంగను మూడుకాళ్లతోఁ తెగునతో గుఱ్ఱమును
యెగసి దండుపై పడ నప్పు డతం డెనసి క త్తితోను
పొడిపొడి జేయుచు దండులనెల్లను పోడిమి జెరుచుచును
వడిగక త్తితో తుండ్లుజేయుచును వదలక దిరుగుచును
అప్పుడు దేసింగుండు నబాబును అంతజూచి వచ్చి
తప్పక బారాహజారి కప్పుడు తగుచిమటాయిచ్చి
అంతట గుఱ్ఱము ముందరికాళ్లను అటయేనుఁగుతలను
గం తెవేసి పెట్టిన మాష్టీకుఁడు కడువడితో మతను
ఘనమగు గుఱ్ఱపుకాళ్ల నప్పుడు క త్తిచేత రెండు
తునకలుగా రెంషవకాలును వడి తుండించగ బెండు
పడి వెనకటిపదములు దెగనంతట బారహజారియును
వడిగాగూలిన దేసింగుఁడు గని వాజిని దుమికియును
కనలుచు గన్నులు యెఱ్ఱఁజేయుచును కడుకోపంబునను
తనచేతులకత్తులు దూసుకొని తనగుఱ్ఱము నటను
నరగున రెండుతుండ్లుగ నఱికి చాలనుగ్రుఁడగుచు
బరువడి దండున పాదచారియై చొరబడి పొగరడచు
గిరగిర దిరుగుచు కత్తులు విసరుచు కినిసియు నఱుకుచును
తరిమి వేయుచును తలలుగొట్టుచును దర్పము జూపుచును

పసచెడి కొందఱు పాఱిపోవఁ గని పకపకనవ్వుచును
రసికులయినయా వీరుల దరుముచు రంకెలు వేయుచును
మెండుగ నఱికి కండలు ప్రేవులు కొండలపొడువునను
ఖండించిన మొండెంబులు తలలును తండంబులుగాను
వేయియేనుఁగుల నొక్కసారిగా వేమరు నఱుకుచును
వేయిగుఱ్ఱముల నొక్కసారిగా వెనబడ వేయుచును
వేయిరౌతులను నొక్కసారిగా విసరటుకొట్టుచును
నా యెడనున్న శూరులబట్టి చయ్యన జంపుచును
ఒక్క సారి వెయికత్తులురాగ తన యొక్క కత్తితోను
చక్కఁగ పోడిమి చెడి జనులందఱు వెక్కసపడఁగాను
నిబాయించలేకను దండచ్చుట నిలువక బారగను
నబాబు తనపాళెంబునదాగెను నంత భయంబునను
నలుదిక్కుల దేసింగుఁడు జూడఁగ నంతట నందఱును
వెలవెలబోవుచు పాఱిపోవఁగను వేసరి జూచుచును
పారిపోయెడివారిని జంపుట పాపంబనుచును
దారితప్పి దాగిన యెదిరించుట ధర్మముకా దనెను
సరగున న న్నొక శూరుఁడయిన మఱి చంపఁడాయె నిపుడు
బరువడి వొంటిగ నేనెటువ్వారికి పరగబోదు నేఁడు

దేసింగు సేనలు శిథిలమైనదిజూచి తనప్రాణము విడుచుటకు నిశ్చయించుట.-

మహమత్ఖానుఁడు జమేదారులును మఱిపినతండ్రియును
సహగా బారాహజారిదండుతో సమసిపోయిరికను
రయముగ నాప్రాణములింకేటికి రంగనాథస్వామీ
ప్రియముగ నీపాదముల జేర్చునను రంగనాథస్వామీ
దాసుఁడనన్ను నీదుసన్నిధిని దనర జేర్చు స్వామీ
వాసిగ నిను నెరనమ్మినవాఁడను వచ్చి బ్రోవుస్వామీ

నాక్రమంబునీ కెఱిగించితిని రంగనాథస్వామీ
చక్రము బంపుము వేగమెనాకు త్వరగ రంగస్వామీ
అనుచు ప్రాణములు పోఁగొట్టుటకు నంతనిశ్చయించి
తనమనంబునను రంగస్వామిని తప్పక నపు డుంచి
పద్మాసనమున గూర్చుండెను తా బరువడి దేసింగు
పద్మాప్తుండగు సూర్యుని జూచుచు పల్కెను దేసింగు
నేనురంగనికి భక్తుండయితే నిజముగానుయిపుడు
నేను శూరసింగునిసుతుఁడయితే నిజముగానుయిపుడు
నేనుసత్యమును తప్పకయుండిన నిజముగానుయిపుడు
నేను యేకపత్నీవ్రతుఁడయితే నిజముగాను యిపుడు
నేనుశూరుఁడయితే యీకత్తి నిజముగానుయిపుడు
పూనికతో నారొమ్ముననాటి పొసగ చంపు నేఁడు
అనుచు కత్తి తా నెగర వేసి రొమ్మపుడు జూపఁగాను
ఘనమగుకత్తియు రొమ్ముననాటి కదసిదూరె వెసను
హరిహరియనుచును ప్రాణమువిడిచెను అప్పుడు దేసింగు
సరసిజాక్షుని ప్రాణము విడిచెను చయ్యన దేసింగు
అపుడునబాబు దండుననుండి యతిశీఘ్రముగాను
నిపుణుఁడయిన దేసింగునిపాటు నెనసిచూచుటకును

-- దేసింగు కళేబరంబునుజూచి నబాబు వ్యసనము జెందుట. --

దండుతోడను నబాబప్పుడు దగ్గిరికిని వచ్చి
పండితుఁడగు దేసింగుని జూచి బహువ్యసనము మించి
యేనుఁగుపయిన నుండునబాబు తానటు దిగివచ్చి
ప్రాణముపోయిన దేసింగుని తా బరువడి నటుజూచి
కూర్చుండియు దేసింగునిజూచి కొంతవగచి వగచి
జేర్చి యతనిముఖమున తనముఖమును మూర్ఛపోయి లేచి

బాలుఁడ దేసింగయ్యానాతో పలుకవేమియిపుడు
చాలయలసి నిద్దురపోయెద వింతేల వచ్చె నేఁడు
యింతశూరుఁడని తెలిసితె నేను యిప్పుడు దేసింగు
యింతరాజ్యమును యేలుమనుచుని కిత్తుర దేసింగు
చెలగి యింతకార్యంబని తెలిసితె చెంజిపయికి నేను
తలచను యెందుకు యడిగితి నిన్ను తగవుమాలినేను
మాటిమాటికిని ముద్దుబెట్టుకొని మరిమరి వగచుచును
నూటిగ దేసింగుని శృంగారము చూచియు నేడ్చుచును
పాపినైతినే నీవుచచ్చుటకు బాలుఁడ దేసింగు
పాపపునిందలు పడితిని భువిలో బాలుఁడ దేసింగు
లక్షయేనుఁగులు నీచేమడిసెను యీక్షణంబులోను
లక్షణమగు గుఱ్ఱంబులునాలుగులక్షలు నీచేను
సమసె కోట్లసంఖ్యలుజనములను సరగున నఱికితివే
క్రమముగ నీకత్తికి సరిలేకను కదసియు తిరిగితివే
తడయక నబాబు వగచుచునుండగ దగ్గరివారెల్ల
తొడిబడిమూర్ఛల జెందుచు నందఱు దుఃఖపడుచునల్ల

{ నబాబుబంగార్నాయనిజూచి బంగారుపల్లకిలో దేసిం
గునుంచి చెంజికి యెత్తించుకపొమ్మని సెలవొసంగుట. }

ఉండనబాబు బంగార్నాయని యొప్పుగానుజూచి
మెండుగ బంగరుపల్లకి దిండ్లును మెత్తలు దెప్పించి
చెలువుతో దేసింగుని నందుంచి చెంజికిని నేఁడు
జలిదిగనీవును తోంద్రమల్లుఁడును జమేదారు లిపుడు
పల్లకి నెత్తించుక పొమ్మన్నను బంగార్నాయఁడును
మెల్లగ దేసింగుని యెత్తియు నా పల్లకిలోపలను
పెట్టియప్పుడు బహుజాగ్రతతో నట్టిభుజంబులను
పట్టుపట్టు డని యెత్తుకపోయిరి పరగ చెంజికటను

ముందుగ తోంత్ర మల్లునిబంపి యందు రాణితోను
సందడిసేయక సమాచారములు జలిది చెప్పుము నేను
తొందరపడుచును చెంజికిపోయి తోంత్రమల్లుడును
అందునున్న దాదులతో జెప్పంగ నంతట వారలును
దేసింగునిపా టంతరాణితో తెలియజెప్పంగాను
వాసితప్పి యారాణి యిప్పుడు వారితో కన నేను
ముందుపోటు తగిలితె తెమ్మనుము ముఖ్యముగా నిటను
అందు వెనక పోటై తే తేవల దందె నింపుము నేను
రొమ్ముపోటు తగిలినదని జెప్పంగ రమ్మని సెలవిచ్చి
సమ్మతముగ తననాథునిజూచి చాలగదుఃఖించి
యున్నవారు పల్లకి నటుదించి యొప్పంగ నందఱును
మన్నన మనప్రాణములతో విడిచితె మనము పోదమటను

రాణి దేసింగునిజూచి చింతాక్రాంతయై దుఃఖించుట.

రాణియంత బహుదుఃఖముతో తన ప్రాణనాథుం జేరి
మాణిక్యమా నాప్రాణసఖ్యమా మరియు నిన్నుకోరి
పెండ్లిచేసుకొని యేమిసుఖంబుల ప్రీతినను భవిస్తి
కండ్ల నిన్ను జూచుటకే నీకడగండ్లనోము నోస్తి
నావద్దికినీ వొచ్చినప్పుడే నరసి ప్రాణనాథా
పోవద్దని నే నెంతో జెప్పితిని పోనంగ ప్రాణనాథా
వినకపోతి వింకనేమిసేయుదును వెఱ్ఱిని జేసితివే
వెనక నింక నా కెవ్వరుదిక్కు వృథగా జేసితివే
అని తననాథుని పైంబడియేడ్చుచు తడబడి మూర్ఛిలుచు
ఘనుండగు దేసింగుని రూపంబును కనుంగొని వగంగొనుచు
జూడవచ్చినవార లెల్లరును జూచి మొదుకొనుచు
తోడువచ్చిన దాదుల జూచుచు గూడిం జెప్పుకొనుచు
బహువ్యసనముతో దగ్గఱనుండెడి బంధుజనులజూచి

సహాజంబుగ వారలతో బలికెను సన్నుతంబుమించి

{ రాణి యగ్నిప్రవేశంబుచేసి దంపతులు దేవ విమానము నెక్కి స్వర్గంబున కరుగుట. }

గుండం బొక్కటి త్రవ్వించుమనె కోరిరాణియపుడు
దండిగ గంధపుచెక్కలనందులో దనర వేయునేడు
వాసనద్రవ్యము కర్పూరంబును వరుసనెయ్యిపోసి
వాసిగఘంటలు వేయుమనుచును వారికి సెలవిచ్చి
స్నానముచేసి పసుపుచీరెయును చాలఁగ ధరియించి
పూని పసుపుకుంకుమపువ్వులును పొందుగాను దాల్చి
నవరత్నంబుల భూషలుబెట్టి నాథుని మదినెంచి
భువిలోగల భూసురులకునెల్లను పొసగ దక్షిణిచ్చి
భాసురంబుగను ముత్తయిదువులకు పరమముదంబునను
వాసిగనెక్కిన చీరలు రవికెలు వరభూషణములును
కుంకుమ పసుపు పుష్పగంధము కోర్కెదీరగాను
శంకలేక వారలకునుయిచ్చి చాల దీవెనలును
గైకొనివారల కెల్లరకును నమస్కార మపుడు జేసి
ప్రాకటమొప్పగ భక్తితోడను భావుకముల వడసి
దేవతలకు దా మ్రొక్కెనప్పుడు దివ్యపదవి గోరి
భావమురంజిల జూచె నందజేని పరమపదము మీరి
మూడుచుట్లు గుండంబునకును తా ముఖ్యముగా వచ్చి
తోడని తననాథుని దగ్గరికి వేడుకలర వచ్చి
తాంబూలంబును జేసి రత్నముల్ దనర చేతఁబట్టి
అంబరంబునకు నెగరగ రత్నము లంతజలిదినెట్టి
చుట్టుబడ్డయా రత్నములెల్లను సొంపుతోడజనులు
అట్టెయెత్తుకొని సంతోషంబున నలరిరంత ప్రజలు
నాథుని గుండంబుననుంచియు తా నంత సమ్మతించి

సాధులకెల్ల నమస్కరించి తానరగ నగ్ని జూచి
భావంబున శ్రీహరి హరి యనుచును పరగ సంతసించి
దేవుండయిన యగ్నిహోత్రుని తేజమునకు మ్రొక్కి
నారాయణ శ్రీకేశవ యనుచును అంత నగ్ని జొచ్చి
సారెకు శ్రీ పరమేశా యనుచును సరవితోడ జొచ్చి
ఉన్నంతన యా దేవవిమానము నొప్పుగాను రాగ
సన్నుతులగు యాదంపతులిద్దఱు స్వర్గమునకు నేగ
పుష్పవిమానం బచటనప్పుడును పొందుగ దేవతలు
పుష్పవర్షములు గురియించుచును పొగడిరంత మేలు
అని నారదముని దేసింగునికథ నంత దెలుపఁగాను
విని సురనాథుఁడు సంతసించెను వేడ్క మీరఁగాను
సరగున నారదుఁ డంతలోకసంచారము గయికొనెను
గరిమెతో నేగిరి దేవతలెల్లను కడుముదమునుందఁగను
శూరుఁడయిన దేసింగునికథను సొంపుగ నెవరయిన
సారెకు వ్రాసిన చదివిన విన్నను స్వారస్యముగనిన
పుత్రపౌత్ర భాగ్యంబులు గలిగి పొందుగాను వెలసి
గోత్రవృద్ధియును శత్రునాశనము కోరికెలను వడసి
ఆయుర్వృద్ధియు శ్రేయస్కరమును అధికసంపదలను
బాయక నెప్పుడు గలుగును వారికి బహుభోగంబులును
ఆచంద్రార్క స్థాయిగ నీకథ అతిశయంబుగాను
భూచక్రంబున నుండఁగవలెనని పొందుగ కోరెదను
విరచించితి దేసింగురాజుకథ వీనులవేడుకను
[illegible]ను సంభ్రమంబుతోను
సామాన్యముగా జెప్పితి నీకథ స్వారస్యముగాను
రామార్పణముగ జేసితినిప్పుడు రమణీయంబుగను.

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1923.

# మా క్రొత్త పుస్తకములు

| | | ప్రతి 1-కి రూ. | పై. |
|---|---|---|---|
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 50 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యకృతి | ... | 1 | 00 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 0 | 75 |
| వసుచరిత్ర, సటీక | ... | 12 | 50 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 25 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు | ... | 10 | 00 |
| ఆంధ్రమహాభారతము:— | | | |
| ఆదిపర్వము, టీక (ప్రాతది) | ... | 8 | 00 |
| ఆదిపంచకము | ... | 18 | 00 |
| [illegible]పంచకము, స్త్రీపర్వము | ... | [illegible] | 00 |
| శాంతి సప్తకము | ... | 8 | 50 |
| ఆది సభాపర్వములు గల సంపుటము | ... | 5 | 00 |
| ఆరణ్యపర్వము | ... | 5 | 00 |
| విరాటోద్యోగపర్వములు | ... | 5 | 00 |
| భీష్మద్రోణపర్వములు | ... | 5 | 00 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 5 | 00 |
| శాంతిపర్వము | ... | 5 | 00 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | ... | 5 | 00 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 25 |
| „ టీకతో | ... | 0 | 75 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి-1